


రామ్ మరియు శ్యామ్ స్కూలు
ట్రెక్‌లో గడుపుతుంటారు, రోజంతా హైకింగ్
చేసి పిల్లలు కేంప్‌కి తిరిగి వస్తుంటారు.






ఇక మరోవైపు కింగ్ క్రీప్ దాన్ని చూస్తుంటాడు




చివరి అబ్బాయి వంతెన దాటగానే అది తెగి, ఇతర
గుంపు నిస్సాహాయ స్థితిలో ఉండిపోయేలా చేస్తుంది.






పిల్లల ముందు ఆ పసివారిని కాపాడే
ఒకే మార్గముంది, డెక్స్ట్రటిక్స్‌ని వాడడం.
వారు అరటి రుచి పాపిన్స్ తింటారు.




పిల్లలు సొంతంగా పర్వతం అటువైపు వరకు
సాగుతారు, వంతెనకు బదులుగా నిలుస్తారు.




ఒకరి తర్వాత ఒకరు చిన్నారులు దాటుతుంటారు



వారు పన్నిన కుట్ర సఫలం కాలేదని తెలుసుకొని
కింగ్ క్రీప్ మరియు అతని సహచరుడు పారిపోతారు.




తర్వాత పిల్లలు వారి మామూలు
ఆకారానికి చేరుకుంటారు.



# ఈ సంచికలో...



చందమామ సంపుటి: 63














**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B',
MIDC, Andheri (East), Mumbai-400093.

# వర్షాలూ, బడీ, కొత్త స్నేహితులూ!

మనం కొత్త విద్యాసంవత్సరం ముంగిట్లోకి వచ్చేశాము. ఈ నెలతో సెలవులు ముగిసిపోనున్నాయి. రోజు పొడవునా సరదాగా, అల్లరి చిల్లరిగా గడిపిన క్షణాలకు మనం వీడ్కోలు చెప్పవలసిన సమయం ఆసన్నమయింది. అదే సమయంలో, తొలిరోజు పాఠశాలలోకి అడుగుపెట్టే సమయం కూడా ఉద్విగ్నభరితంగానే ఉంటుంది. కొత్తపుస్తకాలు వెలువరించే సువాసన, కొత్త సెక్షన్‌లో మన బెంచీని ఎవరు పంచుకుంటారు అనే అంచనా, కొత్త తరగతి, నూతన మిత్రులు ఇంకా మరెన్నో విశేషాలు అలా మన అనుభవంలోకి రానున్నాయి. వేసవి సెలవులను ఎవరెవరు ఎలా గడిపారు అనే ఎడతెగని చర్చలతో తొలి వారం వేగంగా సాగిపోతుందనడంలో సందేహమే లేదు!

మీరు సెలవులను ఎలా గడిపేశారో మాకు తెలుపుతారని ఆశిస్తున్నాము. మీరు కేవలం ఆటలతోటే పొద్దుపుచ్చకుండా పదిమందికి ఉపయోగపడే పనులలో కూడా పాలు పంచుకుని ఉంటారని మాకు తెలుసు. జూన్ నెలలో వర్షాలు పలకరిస్తాయి. గత ఏడాది దేశంలో చాలా చోట్ల వర్షాలు లేక ఆహారధాన్యాల ధర చుక్కలు తాకాయి. ఇది రైతులు, ఇతర వర్గాల ప్రజలపై తీవ్ర ప్రభావం చూపింది. ఈ ఏడాదయినా వర్షాలు సమృద్ధిగా కురిసి చెరువులు నిండుతాయని, మనకు మంచినీళ్లు, పొలాలకు సాగునీరు తగినంతగా అందుబాటులోకి వస్తాయని ఆశిద్దాము.

నీరు సహజ వనరు కాబట్టి మనం ఇష్టప్రకారం వాడేస్తున్నాము. ఈ విలువైన సహజ వనరును మనం ఎంతగా వ్యర్థపరుస్తున్నామంటే మన అనాలోచిత నిర్ణయాల వల్ల కలుగుతున్న దుష్ప్రభావాల గురించి మనం ఏ మాత్రం గ్రహించడం లేదు. నీటిని ఆదా చేయక పోయినట్లయితే తాగునీరు కొరత ముంచుకొస్తుంది. దీంతోపాటు విద్యుత్ కోతలు, పంటలు దెబ్బతినడం, మరెన్నో సమస్యలు మనల్ని చుట్టుముడతాయి. కాబట్టి మనం నీటిని సంరక్షించడమే కాదు, వాన నీటిని నిల్వచేయడం కూడా పాటించాలి. దీనివల్ల మనం నీటి సాధికారత సాధించడమే కాక ప్రకృతి వైపరీత్యాల బారినుండి మనం ఓ మేరకు తప్పించుకోగలము.

మరి నీటిని ఎలా ఆదా చేయాలనే అంశంపై మీ ఆలోచనలను మాతో పంచుకుంటారా?

– సంపాదకుడు





జూన్ 2010 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher:**
Prashant Mulekar
**Associate Editors:**
Sowmya Rajendran, R. Vaasugi, K. Raja Sekhara Raju
**Content Head - Online:**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist:**
Venki
**Creative Designer:**
Meghana Vaidyanathan
**Creative Writers:**
S. Niveditha, R. Rama
**Layout Designer:**
K. Narendra Raju
**Production In-charge:**
Prashant Pawar
**Circulation:**
e-mail: circulation@chandamama.com
**Head - Sales and Circulation:**
Sanjay B Thorat
**Manager - Sales & Circulation:**
AB Sairam
**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid
**Assistant Manager - Circulation:**
Rajendra K Jadhav
**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej
**Sales Officer - Circulation:**
K. Ravishankar
**Advertisement:**
e-mail : sales@chandamama.com
**Subscription:**
e-mail: Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2829
Jalpa Doshi (Mumbai)
Ph: +91 22 2831 2872/2831 1849
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు

ఏప్రిల్ చందమామలో దాసరి గారి శిథిలాలయం సీరియల్ పునఃప్రారంభించినందుకు అభినందనలు. బేతాళ కథ 'స్వర్ణ పుష్పం' చాలా బాగుంది. కానీ కథ చివరలో రాక్షసుడు చేసిన గొప్ప త్యాగానికి గాను అతడు తన దానవగుణం పోగొట్టుకున్నట్లు ముగించి ఉంటే బాగుండేది. 'ఉత్తరకాండ' అద్భుతం.

పిల్లలు ఇలాంటి పౌరాణిక ఇతిహాసాలను బాగా ఇష్ట పడతారు. పంచతంత్ర కథలు మహాద్భుతం. ఇక 'టీవీ బాటలో' ఏవిధంగా చూసినా చందమామ ప్రమాణాలకు తగిన హాస్యకథ కాదు. తరం నుంచి తరానికి సాగిపోతున్న మధుర జ్ఞాపకాల స్రవంతి కాబట్టే చందమామ ఒక స్వప్నం..– శ్రీలేఖ, హైదరాబాద్

ప్రతినెలా చందమామ పుస్తకాన్ని కొంటున్నాము. బేతాళ కథలు అంటే మాకు చాలా ఇష్టం. రామాయణంతోపాటు 'మహాభారతం', పురాణ కథలు కూడా ప్రచురించండి. చందమామ ఒకటో తేదీనే మార్కెట్లో ఉంటే బాగుంటుంది. – ఎం.కశ్యప, సిద్ధార్థ, తిరుపతి

ఏప్రిల్ చందమామలో శిథిలాలయం సీరియల్ ప్రారంభ కథ చదవటం చక్కటి అనుభూతి. 'శాస్త్రజ్ఞానం – లోకజ్ఞానం', 'స్వర్గం–నరకం' చిన్న కథలు ప్రచురించినందుకు అభినంద నలు. బేతాళ కథ 'స్వర్ణపుష్పం' అత్యద్భుతం. 'దేశభాషలు నేర్చుకుందాం' చాలా మంచి శీర్షిక. ఆరోగ్యంపై కూడా కొత్త శీర్షిక ప్రవేశపెట్టగలరు. – వజ్రాల రామలింగం, హైదరాబాద్

సెలవులను పథకం ప్రకారం గడపాలని మంచి సలహా ఇచ్చారు. చిన్నకథలలో నీతిని పిల్లలు చక్కగా గ్రహిస్తున్నారు. సీరియల్స్ అన్నీ రసపట్టులో ఉన్నాయి. బేతాళ కథలు పిల్లలకు చెబుతుంటే ఎంతో శ్రద్ధగా వింటున్నారు.

– పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://Telugu.chandamama.com**



# శరీరం విలువ



ఉదయగిరి రాజు ఉదయసేనుడు గొప్ప ధర్మాత్ముడు. అతను తన రాజ్యంలో అన్ని వృత్తులవారికీ సుఖంగా జీవితం సాగేటట్టు అనేక ఏర్పాట్లు చేశాడు. కరువు అనే మాట లేకుండా అందరికీ పనులు కల్పించాడు.

ఎవరు కానీ కటిక దారిద్ర్యం అనుభవించనవసరం లేకుండా చేశాడు. రాజు ఇలా చేయడం చేత దేశంలో యాచన అన్నది చాలా భాగం తగ్గిపోయింది.

ఉదయగిరి రాజ్యంలో ఏ పనీ చేసుకోలేని ముసలివాళ్ళూ, వికలాంగులూ, నిస్సహాయులూ మాత్రమే బిచ్చమెత్తి కాలక్షేపం చేసుకునేవాళ్ళు.

ఆ దేశపు బిచ్చగాళ్ళలో ఒక యువకుడు ఉండేవాడు. వాడు పుట్టి బుద్ధి ఎరిగినప్పటి నుంచి పనిపాటల జోలికి పోకుండా బిచ్చగాడి వృత్తిలోనే బతుకుతూ వస్తున్నాడు. కానీ, రాజ్యంలో బిచ్చగాళ్లకు ప్రోత్సాహం క్రమక్రమంగా తగ్గిపోతూ ఉన్నందువల్ల వాడికి తన వృత్తి జీవితం అంతకంతకూ కష్టతరం కాసాగింది.

చివరికొకనాడు ఉదయం మొదలు మధ్యాహ్నం దాకా ఏ వీధిలోనూ వాడికెవరూ బిచ్చం పెట్టలేదు. ఏ ఇంటి ఇల్లాలూ అతడిపై కనికరం చూపి కాస్త బిక్షమేసిన పాపాన పోలేదు. ఆకలి దహించుకుపోతూ, ఉండగా ఆఖరికి రాజధానిలో ఒకచెట్టుకింద కూర్చుని, వాడు దారే పొయ్యేవాళ్లందరినీ అతిదీనంగా యాచించసాగాడు. అయినా ఎవరూ వాడి కేసి చూడలేదు.

భగవంతుణ్ణి ధ్యానిస్తే నైనా ప్రజలకు దయ కలుగుతుందేమోనని వాడు గొంతెత్తి, ''ఓ పరాత్పరా, పేదవాడికింత ముష్టి! ఆపద్రక్షకా, కడుపు కాలేవాడికొక కబళం! దయామయీ, దౌర్భాగ్యుడికింత ధర్మం!'' అని కేకలు పెట్టసాగాడు.

అప్పటికీ ఎవరూ వినిపించుకోలేదు. అరిచి, అరిచి, అసలే ఆకలిగా ఉన్నవాడికి

శోష కూడా రాసాగింది. వాడికి దేవుడిపైన కోపం వచ్చింది.

''ఓరి భగవంతుడా, ఎక్కడ చచ్చావురా? పుట్టించిన వాడు పెట్టించడా అంటారే, పుట్టించిన వాడివి పెట్టించవేంరా, నీ అమ్మ కడుపు కాలా!'' అంటూ వాడు నోటికి వచ్చినట్లు తిట్టసాగాడు.

సరిగ్గా ఆ సమయంలోనే రాజు ఉదయసేనుడు గుర్రం మీద రాజవీధి వెంట వెళుతూ బిచ్చగాడి మాటలు ఆలకించి, గుర్రాన్ని ఆపి, దిగి నేరుగా వాడి వద్దకు పోయి, ''ఎవర్నిరా అలా తిట్టిపోస్తున్నావు?'' అని అడిగాడు

''ఇంకెవర్ని? పాపాల బైరవుడు ఆ భగవంతుణ్ణే!''అని అన్నాడు బిచ్చగాడు.

''కోరిన కోరికలు నెరవేర్చే భగవంతుణ్ణి పూజించాలి గాని ఎవరైనా ఇలా ఇష్టం వచ్చినట్లుగా తిడతారా?'' అన్నాడు రాజు.

''ఇంకేం చెయ్యాలి? పొద్దున లేచినప్పటినుంచీ కూడు దొరక లేదు. ఎంతసేపు ముష్టెత్తినా చిన్న కాసైనా దొరక్కపోయె!'' అన్నాడు బిచ్చగాడు కోపంగా.

''ఒరే, ఒక పని చెయ్యి.. నీకు డబ్బు నేనిస్తాను. నేనీ దేశానికి రాజును. బదులుగా నీ చెయ్యి ఒకటి నాకు ఇచ్చెయ్యి. వెయ్యి రూపాయలిస్తాను. లేదా కాలొకటి ఇయ్యి. నేను రెండు వేలిస్తాను. ఇంకా నీ కళ్లిచ్చావంటే ఏకంగా అర్ధరాజ్యం ఇస్తాను.'' అన్నాడు రాజు.

''మంచి బేరమే! నీ డబ్బు నా కొద్దు. ఈ మారుబేరం వద్దనేవద్దు నేనేమీ ఇవ్వనుగాక ఇవ్వను,'' అన్నాడు. బిచ్చగాడు.

''అంటే, నువ్వు చాలా భాగ్యవంతుడవన్న మాట! నీకు వెయ్యివరహాల కంటే విలువైన చెయ్యీ, రెండువేల కన్న విలువైన కాలూ, అర్ధరాజ్యం కన్న ఎక్కువైన కళ్ళూ ఉన్నాయన్నమాట! అవి ఇచ్చినందుకు దేవుణ్ణి పూజించక తిడతావేమిరా, పశువా? పో, దేవుడిచ్చిన విలువైన కాళ్లూ, చేతులూ ఉపయోగించి పొట్టపోసుకో, బిచ్చమెత్తకు!'' అని వాణ్ణి మందలించి రాజు వెళ్లి పోయాడు.

అది మొదలు వాడు వీధుల వెంట బిచ్చమెత్తడం మాని శరీర శ్రమ చేసి బతకడం నేర్చుకున్నాడు.





# నిజాయితీ

పోలవరం జమీందారు దివాణం కాపలా కాయడానికి, నౌకరును నియమించాలనుకున్నాడు. అది తెలిసి ఆనందుడు, సునందుడు అనే యువకులిద్దరు వచ్చారు. జమీందారు, ఆనందుడిని ఆ రాత్రి దివాణం కాపలా కాయమన్నాడు.

మర్నాడు జమీందారు, ఆనందుడిని పిలిచి సాయంత్రం దాకా తోటలో మొక్కలకు నీళ్లుతోడి, కలుపు తీసి వెళ్లమన్నాడు. ఆ పనులు అతడు ఆడుతూ పాడుతూ సునాయాసంగా చేశాడు. కాపలాపని ఇచ్చేదీ లేనిదీ నాలుగు రోజుల్లో కబురు పెడతానని జమీందారు చెప్పాడు.

ఆ మరుసటి రోజున జమీందారు, సునందుడిని కూడా కాపలా పనికి నియోగించి, మర్నాటి ఉదయం, ఆనందుడికి చెప్పినట్లే తోటపని చూడమని చెప్పాడు. అయితే, వాడు తోటపని చేస్తూ మధ్య, మధ్య కునికిపాట్లు పడుతూండటం, పని మందకొడిగా చేయడం జమీందారు గమనించాడు.

తర్వాత ఇద్దరినీ పిలిపించిన జమీందారు, సునందుడితో, "నీకు దివాణం కాపలా కాసే పని ఖాయం చేశాను. ఆనందుడు నీలాగా కాక, తోటపని ఏ కునికిపాట్లు పడకుండా సునాయాసంగా చేశాడు. అంటే వాడు ఆ రాత్రి దివాణం కాపలా కాయడం సరిగా చేయక నిద్రపోయాడన్నమాట. నాకు కావలసింది, చెప్పిన పని నిజాయితీగా చేసేవాడు!" అన్నాడు.

– రాంబాబు

# చక్రవర్తి పరీక్ష

చైనా చక్రవర్తి తన రాజమందిరంలో కూర్చుని సుదీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. వృద్ధాప్యం వల్ల అతడు రాజ్య వ్యవహారాలను నడపలేకపోతు న్నాడు. పిల్లలు లేకపోవడంతో ప్రజలకు సవాలు విసరడం ద్వారా తన వారసుడిని ఎంచుకోవడమే ఉత్తమ మార్గమని అతడు నిర్ణయించుకున్నాడు. చెట్లు అంటే ప్రాణం పెట్టే రాజుకు ఏం చేయాలో బాగా తెలుసు!

రాజు ఓ ప్రకటన చేశాడు. రాజ్యానికి రాజు కావాలని కోరుకుంటున్న వారందరూ రాజ మందిర ద్వారం వద్దకు రావాలి. ఈ ప్రకటనతో అందరిలోనూ ఉత్కంఠ బయలుదేరింది. రాజ్యాన్ని ఏలడంలో తమకంటే మించిన వారు లేరని ప్రతి ఒక్కరూ తమకు తాము భావించుకోసాగారు.

తరవాత రాజమందిరం ద్వారాల ముందు వేలాది మంది ప్రజలు తోసుకుంటూ వచ్చి నిలబడ్డారు. తలుపులు మెల్లగా తెరుచు కున్నాయి. రాజు వారి ముందుకు వచ్చాడు.

''పరీక్షకు సిద్ధమై వచ్చిన నా ప్రజలను చూస్తోంటే నాకు ఈరోజు చాలా సంతోషంగా ఉంది.'' నవ్వుతూ చెప్పాడు రాజు.

ప్రజలు దాంతో కేరింతలు కొట్టారు. రాజు గొంతు సవరించుకున్నాడు.

''ఇప్పుడు పరీక్ష మొదలవుతోంది. మీలో ప్రతి ఒక్కరూ ముందుకు వచ్చి ఇక్కడున్న విత్తనాల్లోంచి ఒక్కో విత్తనం తీసుకోండి.'' అన్నాడు. రాజభటులు ప్రజలకు విత్తనాలను పంచిపెట్టారు. అందరూ తీసుకునేసరికి చాలా సమయం పట్టింది. తరవాత అందరూ తదుపరి ఆదేశాలకోసం రాజు వైపు చూస్తూ వేచి ఉన్నారు.

''ప్రజలారా! విత్తనాలను మీ మీ ఇళ్లకు తీసుకుపోండి. ఒక కుండీలో ఆ విత్తనాలను పూడ్చి పెట్టండి. మీ స్వంత బిడ్డల్లా వాటిని సాకండి. ఆరు నెలల తర్వాత మళ్ళీ రాజ మందిరం వద్దకు రండి. మంచి ఫలితం చూపించిన వారిని నేను ఎంపిక చేస్తాను. ఇక వెళ్లండి!'' అన్నాడు రాజు.



ప్రజలు విత్తనాలను తమ చేతుల్లో పొదివి పట్టుకుని వెళ్లి పోయారు. రాజ్యంలో ప్రతి

ఒక్కరూ విత్తనాల పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. రాజవిత్తనం తమకు సింహాసనం దక్కేలా చేయనుంది మరి.



కొంతకాలం పాటు ఏమీ జరగ లేదు. కుండీలలోని మట్టిలోపలే విత్తనం ఉండిపోయింది. తర్వాత ఒక రోజు చువాన్ వీధుల్లోకి పరు గెత్తుకుని వచ్చాడు. అతడు ఉద్వే గంతో చేసిన ప్రకటన ప్రతి ఒక్కరిలో అసూయను రగిలించింది.

‘‘నా గింజ మొలకెత్తింది. ఈరోజు ఉద యమే దాన్ని చూశాను!’’ అరిచాడు చువాన్. కొందరు అతడిని అభినందించారు. మరి కొందరు అసూయతో దహించుకుపోతూ అక్కడినుంచి వెళ్లి పోయారు.

తర్వాత చువాన్ తాను రాజభవనంలో నివసించబోతున్నట్లు కలలు కనసాగాడు. తనపట్ల భక్తిప్రపత్తులు ప్రదర్శిస్తున్న పిల్లల వద్ద రాజదర్పం ఒలకబోయసాగాడు. ప్రతి రోజూ మొక్కకు అతడు నీళ్లుపోసి జాగ్రత్తగా పెంచసాగాడు. గొంగళి పురుగు అనేది ఆ మొక్క ఉన్న చోటికి మైలు దూరం వరకు సమీపించలేనంతగా అతడు జాగ్రత్తలు తీసు కున్నాడు. అలాగే ప్రతి ఇంటిలోనూ కుండీల చుట్టూ కంచెలు కట్టి రాత్రిపూట వాటికి కావిలి కాసేందుకోసం కాపలాదార్లను నియ మించుకున్నారు. క్రమక్రమంగా ప్రతి ఇంటి లోనూ విత్తనాలు మొసులెత్తడంతో అందరిలో ఉద్వేగం. అయితే ఒక్కటి మాత్రం మొల కెత్తలేదు. అది జున్ అనే వ్యక్తి విత్తనం. ప్రతి రోజూ జున్ ఆశగా విత్తనంకేసి చూస్తూ వచ్చాడు కాని ఆ విత్తనం మట్టిలోపలే ఉండి పోయింది. జున్ నిరాశకు గురయ్యాడు. ఎన్ని విధాలుగా ఆలోచించినప్పటికీ తను నాటిన విత్తనం ఎందుకు మొలకెత్తలేదో అర్థం కావడంలేదు. చిక్కటి ఎరువును కుండీలో వేసి, మరింత మట్టిని కలిపి విత్తనాన్ని ఇంకాస్త లోతుగా పూడ్చిపెట్టాడు.

అయినా ఫలితం లేదు. దాంతో ఒండ్రు మట్టిని తెచ్చి మరొక కుండీలో పోసి విత్తనాన్ని దాంట్లో పూడ్చి పెట్టాడు.

‘‘చిన్నారి గింజా, మొలకెత్తవే, పైకి రావే’’ అంటూ జున్ ప్రతి రోజు వేడుకునేవాడు. అయితే చిన్ని విత్తనం అతడి మొర వినలేదు. మట్టిలోంచి చిన్న మొగ్గ కూడా తొడగలేదు. ఇతరులు అతడి అవస్థ చూసి గేలి చేస్తుం డగా జున్ కన్నీళ్లు తుడుచుకునేవాడు. అలా ఆరునెలలు వేగంగా సాగి పోయాయి. ఒక రోజు రాజు ప్రకటన చేస్తూ అందరూ తమ కుండీలను తీసుకుని రాజమందిరం వద్దకు

రావలసిందిగా ఆజ్ఞాపించాడు. ప్రతి వారూ తమ మొక్కను నీటితో తడిపి, కుండీమెరిసేలా బాగా రుద్దారు.

ప్రజలు తమ కుండీలను మోసుకుంటూ పురవీథుల్లో నడిచి పోతూ ఉండటం జున్ తన ఇంటి కిటికీలోంచి చూశాడు. జున్ కిటికీవద్ద నిలబడి ఉండటం అతడి అమ్మ కంటబడింది. ''జున్, నీ కుండీని తీసుకుని రాజు వద్దకు ఎందుకు వెళ్ళడం లేదు?'' అని అడిగింది తల్లి ఆశ్చర్యంతో.

''అమ్మా, నన్ను చూస్తే నీకు కూడా ఎగతాళిగా ఉందా. ఖాళీ కుండీతో అక్కడికి ఎలా వెళ్లగలను?'' ప్రశ్నించాడు జున్.

''జున్, నీకు సాధ్య మయినంత మేరకు ప్రయత్నించావు. విత్తనం మొలకెత్తడానికి కావలసినవన్నీ చేశావు. రాజుకు నీ కష్టం గురించి చెప్పు. పద నేనూ వస్తాను,'' అని చెప్పింది అమ్మ.

అలా తల్లీ కొడుకులు ఖాళీ కుండీతో రాజు వద్దకు వెళ్లారు. రాజు ప్రతి ఒక్క కుండ వద్దకు వెళ్లి మొక్కలను చూస్తుండగా జున్ చివరలో ఒక మూల నక్కి నిలబడ్డాడు. ఉన్నట్లుండి రాజు, ఖాళీకుండీ పట్టుకుని గజగజ వణుకుతూ నిలబడ్డ జున్‌కేసి చూశాడు.

''అబ్బాయీ, ఇలా రా'' ఆజ్ఞాపించాడు రాజు. జున్ భీతిల్లిపోయాడు కాని, తల్లి అతడిని ముందుకు నెట్టింది. ''మహారాజా, నా శక్తిమేరకు కష్టపడ్డాను... కానీ విత్తనం లోంచి మొలక రాలేదు. కారణం నాకు తెలియదు.'' అన్నాడు జున్ నత్తి పలుకుతూ.

చక్రవర్తి చేతులు పైకెత్తి ప్రతి ఒక్కరినీ నిశ్శబ్దంగా ఉండమని సంజ్ఞ చేశాడు. తరవాత జనాన్ని ఉద్దేశించి ప్రసంగించాడు. ''మీకు కనికట్టు విద్య తెలుసేమో అని ఆశ్చర్యంగా ఉంది. నేను మీకిచ్చిన గింజలు ఎలా మొలకెత్తగలిగాయో నాకు అర్థం కావడం లేదు.'' అని చెప్పాడు. ''మీకు ఇవ్వడానికి ముందు అన్ని గింజలనూ ఉడకబెట్టించాను.'' అని ముగించాడు.

ప్రజల ముఖాలు ఎర్రగా కందిపోయాయి. అవమానంతో వారు తల దించుకున్నారు.

''మంత్రగాళ్లు నా రాజ్యాన్ని పాలించబోవడం నాకు సమ్మతం కాదు. దానికంటే నిజాయితీ పరుడైన మనిషిని నేను విశ్వసిస్తాను.'' అని ప్రకటించిన రాజు మీసం మెలివేస్తూ జున్‌కేసి చూసి మందహాసం చేశాడు. జున్ తన తల్లి చేతులు గట్టిగా పట్టుకున్నాడు. వారు ఆనందం పట్టలేక ఒకరినొకరు హత్తుకున్నారు.

– రమా రమేష్





## బేతాళ కథలు

# ప్రతీకారవాంఛ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు "రాజా, నీ పట్టుదల ఇద్దరు స్నేహితురాళ్ళమధ్య తలెత్తిన ప్రతీకారవాంఛను తలపిస్తోంది. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు వారి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు.

పూర్వం దండకారణ్యానికి దక్షిణాన ఒక నగరంలో మాలతి, మాధవి అనే ఇద్దరు కన్యలుండేవారు. వారిద్దరూ ఇరుగుపొరుగు ఇళ్ళలో పుట్టి పెరగడమేకాక ఒకే రోజున పుట్టడంతో అక్కాచెల్లెళ్ళలాగా కలిసిమెలిసి పెరిగారు. యుక్తవయస్సు వచ్చేసరికి వారిద్దరూ అందమైనవారుగా తయారయారు. పెళ్ళి చేసుకునేటప్పుడు తామిరువురూ ఒకే కుటుంబానికి చెందిన సమవయస్కులనే వివాహమాడాలని నిశ్చయించుకున్నారు. అలా చెయ్యడం వల్ల తామిరువురూ ఒకే



ప్రాంతంలో ఉంటూ, ఎక్కువతక్కువలు తలెత్తకుండా సుఖంగా జీవించవచ్చనుకున్నారు.

కొన్నాళ్ళకు వారు కోరుకున్నట్టే వారు నివసించే ప్రాంతానికి సమీప రాజ్యంలోని రాజ్యాధిపతి కుమారులు జయవిజయులతో పెళ్ళి సంబంధాలు కుదిరాయి.

ఒకనాడు మాలతి విహారానికని ఒంటరిగా దండకారణ్యంలోకి వెళ్ళి అక్కడి విశేషాలనూ, ప్రకృతి అందాన్నీ చూసి ఆనందిస్తూ చాలాసేపు గడిపింది. అలా తిరుగుతు ఉండగా ఆమె ఒక అపరిచిత ప్రదేశంలో ఉన్న పాడుబడిన శివాలయాన్నీ, దాని ఎదుట ధ్యానం చేసుకుంటున్న ఒక సాధువునూ చూసింది. ఆయనకు భక్తితో నమస్కారం చేసింది.

తనకు నమస్కరించిన మాలతిని సాధువు ఆశీర్వదించి, కుశలప్రశ్నలు వేసి ఆమె వివరాలు తెలుసుకున్నాడు. మాలతి ఆయనతో తన గురించీ, మాధవి గురించీ చెప్పి, పెళ్ళి విషయంలో తాము తీసుకున్న నిర్ణయం గురించికూడా చెప్పింది. అంతా సవ్యంగానే జరుగుతుందని జోస్యం చెప్పిన సాధువు ఆమెకొక అపూర్వమైన మామిడి మొక్కనూ, రెండు అందమైన పెద్ద కుండలనూ కానుకగా ఇచ్చి, వాటిలో ఒక కుండను తన స్నేహితురాలి కివ్వవలసిందిగా మాలతికి సూచన నిచ్చాడు.

వాటిని జాగ్రత్తగా సంరక్షించుకోమనీ, వాటివల్ల వారికి శుభం చేకూరుతుందనీ చెప్పిపంపాడు. మాలతి కుండలను ఇంటికి తెచ్చుకుని వాటిలో ఒకదాన్ని తన ఇంట్లో జాగ్రత్తగా దాచుకుంది. రెండో కుండను సాధువు సలహా ప్రకారం మాధవికిచ్చింది.

సాధువు చెప్పినట్టుగా త్వరలోనే రెండు వివాహాలూ ఒకే ముహూర్తానికి జరిగాయి. జయుడితో మాలతికీ, విజయుడితో మాధవికీ వైభవంగా పెళ్ళిళ్ళు జరిగాయి. ఇరువురూ పక్కపక్కనే ఉన్న గృహాల్లో స్థిరపడి సుఖంగా జీవించసాగారు.

మాలతి తాను తెచ్చుకున్న మామిడి మొక్కను తన పెరడులో జాగ్రత్తగా నాటి, సాధువిచ్చిన కుండతో నీళ్ళు నింపి, దానికి పోస్తూ, శ్రద్ధగా పెంచసాగింది.

మాధవి దగ్గరున్న కుండ మాత్రం ప్రమాదవశాత్తూ దెబ్బతినడంతో దాని కిందిభాగం విరిగిపోయింది. అది చూసి బాధపడిన మాలతి మిగిలిన పెంకును జాగ్రత్తగా దాచమని తన స్నేహితురాలికి సలహా ఇచ్చింది.

కొన్నాళ్ళకు మామిడిమొక్క మరింతగా ఎదగడంతో దాని సంరక్షణకు ఇబ్బందులు

కలగసాగాయి. ఇది చూసిన మాధవి తన వద్దనున్న విరిగిన కుండను మాలతికిచ్చి మొక్కకు రక్షణగా అమర్చుకోమని చెప్పింది. అందుకు సంతోషంగా అంగీకరించిన మాలతి, కుండపెంకును తన మొక్క చుట్టూ నిలిచే విధంగా మట్టిలో బలంగా పాతిపెట్టింది. దానితో మాలతికి ఆ మొక్కను అహోరాత్రాలు సంరక్షించుకునే బాధ తప్పింది.

కుండపెంకుల వలన హానికి లోనవకుండా పెరిగిన ఆ మొక్క త్వరలోనే పెద్దదై పువ్వులు పూయడం మొదలుపెట్టింది. త్వరలోనే అవన్నీ మామిడిపళ్ళుగా తయారు కాసాగాయి. ఆ పళ్ళు తక్కువ సంఖ్యలోనే కాసినప్పటికీ ఎంతో తియ్యగా, అపురూపంగా ఉండేవి. తాము తిన్నాక మిగిలిన ఫలాలను మాలతి కొందరు స్నేహితులకూ, ఇరుగుపొరుగువారికీ ఇచ్చేది. రుచిగా ఉండడమే కాక, వాటిలో మంచి ఔషధగుణాలు కూడా ఉన్నాయనే నమ్మకం కలగడంతో అవేవో దివ్యఫలాలని భావించి ప్రజలందరూ వాటికోసం ఎగబడ సాగారు.

అయితే అడిగినవారందరికీ ఇవ్వగలిగినన్ని పళ్ళు ఏనాడూ ఉండేవికావు. అపూర్వమైన ఈ మామిడిపళ్ళ కోసం దూర ప్రాంతాలవారు కూడా బారులు కట్టసాగారు. మాలతికి ధనాశ ఏమీ లేనప్పటికీ, ఈ కారణంగా త్వరలోనే అనుకోకుండానే ఆమెకు క్రమంగా ఆదాయం పెరగసాగింది.

పొరుగునే ఉండి ఇదంతా గమనిస్తున్న మాధవికి మొదట్లో సంతోషం అనిపించినప్పటికీ రానురాను మాలతి అంటే అసూయ కలగసాగింది. మొక్క విషయంలో మాధవికి ఎటువంటి అధికారమూ లేకపోయినప్పటికి అది పెరగడానికి తాను కూడా సహాయపడ్డాననే





సంగతి ఆమె మరవలేకపోయింది. ఎందు కంటే మొక్కకు రక్షణగా తాను గనక కుండ పెంకును ఇవ్వకపోయి ఉంటే మాలతికి ఇంతటి లాభాలు కలిగి ఉండేవి కావుగదా అన్న ఆలోచన ఆమె మెదడులో కలకలం రేపసాగింది.

ఈ సందర్భంలో కొందరు అమ్మలక్కలు నూరిపోసిన మాటలు తలకెక్కించుకున్న మాధవి ఒకరోజున అకస్మాత్తుగా మాలతికి తానిచ్చిన కుండపెంకును తిరిగి ఇమ్మని కోరింది.

అంతేకాక తన కుండపెంకు విరగకుండా ఉండాలనీ, తానిచ్చినట్టుగా యథాతథంగానే ఇవ్వాలనీ షరతు విధించింది. అది విని నిర్ఘాంతపోయినమాలతి, ''అదేమిటి మాధవీ, నీకు తెలియనిదేముంది? మొక్క పెద్దదైపోయింది కదా? ఇప్పుడు దానికి హాని కలగకుండా నీ కుండను ఎలా తీయగలను? అలా తీయాలంటే పెరిగిన మొక్కను నరకాల్సి వస్తుంది. అయినా పగిలిపోయిన కుండ పెంకువల్ల నీకు మాత్రం ఉపయోగమేముంటుంది? మరేదైనా ఇస్తాను, కోరుకో'' అని ఎంతో ప్రాధేయపడింది.

మాధవి ఎంత చెప్పినా వినక, తాను కోరినట్టుగానే చెయ్యాలని భీష్మించుకుంది. మాధవికి కుండ పెంకుల వల్ల నిజంగా ఉపయోగమేమీ లేదని, కేవలం అసూయతో, కక్ష సాధించడానికే ఇటువంటి కోరిక కోరిందనీ మాలతికి అర్థమయింది. ఈ విషయంలో మాధవి తన భర్త విజయుడి మాటకూడా వినిపించుకోలేదు.

చివరకు మాలతి తన చేతులతోనే తానెంతో అపురూపంగా పెంచుకున్న మొక్కను తెగనరికి కుండను పగలకుండా జాగ్రత్తగా పైకి తీసి, మాధవికి ఇవ్వవలసివచ్చింది.

ఆ తరవాత ఎందరో తోటమాలులు ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ మొక్క మాత్రం మళ్ళీ ఎదగక త్వరలోనే కృశించిపోయింది. మాలతికీ, మామిడిపళ్ళను ఆశించిన అనేక మందికీ నిరాశ తప్ప ఏమీ మిగలలేదు. ఆ తరవాత అప్పటివరకూ ఎంతో అన్యోన్యంగా మెలిగే సోదరులైన జయవిజయులుకూడా మాట్లాడుకోవడం మానేశారు.

ఇదంతా పొక్కడంతో ప్రజలందరూ ఈ విషయాన్ని గురించే చర్చించుకోసాగారు. కొందరు మాలతిపట్ల సానుభూతి ప్రకటించగా మరికొందరు మాధవి తన వస్తువును తాను మళ్ళీ అడిగి తీసుకోవడంలో తప్పేమీ లేదని అభిప్రాయ పడ్డారు. అయితే మాలతి మాత్రం

మాధవితో ఎప్పటిలాగే మామూలు గానే ప్రవర్తించ సాగింది.

త్వరలోనే మాధవి గర్భవతి అయి, ఒక అందమైన ఆడపిల్లను కన్నది. ఇరుగూ పొరుగూ, ఇంటిల్లిపాదీ అందరూ సంతోషించారు. తన స్నేహితురాలి బిడ్డమెడలో మాలతి ఒక అందమైన బంగారుగొలుసును బహూకరించింది. అది చూసి మాధవితోబాటుగా అందరూ ఆనందించారు.

ఆ పిల్లకు మాళవిక అని పేరు పెట్టుకున్నారు. పదేళ్ళు గడిచాయి. మాలతి ఇచ్చిన హారం మహిమ ఏమిటోగాని మాళవికమెడలో నుంచి దాన్ని ఎవరూ తీయడానికి సాహసించలేదు. చక్కటి రూపంతోనూ, తెలివితేటలతోనూ మాళవిక పెద్దదయింది.

ఆ గొలుసుకు కొక్కెం వంటిదేదీ లేదు. దాన్ని మెడలో వేసుకోవటానికైనా, తీసెయ్యటానికైనా తలపైనుంచే వీలవుతుంది. పసిపిల్లగా ఉన్నప్పుడు అలా చెయ్యడం సాధ్యమయేది కాని మాళవిక పెద్దదయాక ఆ హారం ఆమె తల పరిమాణంతో పోలిస్తే చిన్నదిగా ఉండడంతో దాన్ని తీసి పక్కనపెట్టే ఆలోచన మానుకోవలసివచ్చింది.

ఈ కారణంగా అహోరాత్రాలు ఆ హారం ఆమె మెడలోనే మెరుస్తూ ఉండేది.ఒకరోజు మాలతి అకస్మాత్తుగా మాధవితో ''నేను మాళవికకిచ్చిన హారాన్ని తిరిగి తీసేసుకుంటాను'' అన్నది.

ఈసారి ఆశ్చర్యపోవడం మాధవి వంతు అయింది. మాళవిక పెద్దదైపోవడంతో, చిన్నదిగా ఉన్న ఆ హారాన్ని ఉన్నపళంగా ఆమె



మెడనుంచి తొలగించడం సాధ్యం కాదని తేలింది.

ఎట్టి పరిస్థితుల్లోనూ గొలుసును కత్తిరించరాదనీ, యథాతథంగా తనకు తిరిగి ఇవ్వాలనీ మాలతి స్పష్టం చేసింది. మొదట్లో నిర్ఘాంతపోయినప్పటికీ, ఒకప్పుడు తాను మాలతి మామిడిమొక్కను నాశనం చేయించినందుకు ఇది ప్రతీకారమని మాధవికి అర్థమయింది.

''తెంపకుండా హారాన్ని విడిపించాలంటే మాళవిక గొంతును కొయ్యడంతప్ప మరొక మార్గం లేదు. నీ గొలుసుకోసం నా కూతురిని బలిపెట్టమనడం భావ్యమేనా?'' అని ఆమె మాలతిని వేడుకుంది. ఆమె ఎంతగా కళ్ళనీళ్ళు పెట్టుకుని పదేపదే ప్రాధేయపడినప్పటికీ మాలతి మటుకు ససేమిరా అన్నది.

ఈ సంగతి బైటకు పొక్కడంతో నలుగురూ ఆశ్చర్యపోయారు. లోగడ మాధవి ప్రవర్తనను నిరసించినవారు ఆమెకు తగిన శాస్తే జరిగిం

దని భావించారు. ఇతరులు మాత్రం మాలతి తన హారం కోసం ఒక నిండుప్రాణాన్ని, అందులోనూ ఒకచిన్నపిల్లను బలి కోరడం ఘోరమని అభిప్రాయపడ్డారు. మొత్తంమీద ప్రజలందరూ మళ్ళీ రెండు వర్గాలుగా చీలిపోయి వితర్కించుకోసాగారు.

సవతుల పోరు కారణంగా రాజ్యం సంక్షోభంలో పడింది. ఆఖరికి దీన్ని గురించిన నిర్ణయం పాలకులిద్దరిలోనూ పెద్దవాడైన జయుడికే వదిలిపెట్టాలని అందరూ నిర్ణయించారు.

బేతాళుడు ఇంతవరకు కథ చెప్పి, ''రాజా, జయుడు ఈ సంక్లిష్ట సమస్యకు సంబంధించి ఏ రకమైన తీర్పు చెప్పి ఉంటాడు? తన భార్య మాలతికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోవటానికే నిశ్చయించు కున్నాడా? లేక తమ్ముడి కూతురి గురించి దయాగుణం ప్రదర్శించాడా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల వెయ్యి చెక్కలవుతుంది'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు ''నీవు చెప్పినవాటిలో ఏ ఒకటీ కాదు. జయుడు వ్యక్తిగత, భావావేశాలకన్నా తమ సంస్థానం సంక్షేమాన్నే దృష్టిలో పెట్టుకుని వ్యవహరించి ఉంటాడు. వ్యక్తులుగా మాలతికీ, మాధవికీ మధ్య రేగిన చిచ్చు అప్పటికే ప్రజలమధ్య అభిప్రాయ భేదాలకు కారణమయింది. దానికి త్వరలోనే స్వస్తి చెప్పకపోయినట్టయితే రాజ కుటుంబాల మధ్య పొడసూపిన ఈ ప్రతీకార వాంఛకు అంతు ఉండదు. ఒకదానివెంట ఒకటిగా ఎడతెగక కొనసాగే ఇలాంటి స్పర్ధల మూలంగా తమ తండ్రి తమకు అప్పగించిన పాలనాధికారం తొందరలోనే నిష్ఫలమవుతుందని జయుడు గ్రహించి ఉంటాడు. అందుచేత అతను తన కుటుంబంలోనే మార్పు వచ్చేలా మాలతికి నచ్చజెప్పి, మాళవిక మెడలోని హారానికి బదులుగా అటువంటిదే మరొకటి చేయించి, ఆమెకు ఇప్పించి ఉంటాడు. ఆ విధంగా మాలతి, మాధవిల మధ్య ఈ ప్రతీకారవాంఛ శాశ్వతంగా సమసిపోయి ఉంటుంది'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. – *కొడవటిగంటి రోహిణీప్రసాద్*





తర్వాత ఏం జరిగింది?

ధార్విక్ ద్వారా ప్రభాత్‌ని నియంత్రించడానికి సలూంకీ ప్రయత్నించాడు.

నీకు చంపడం అంటే ఎందుకంత ఇష్టం?

నేను నీకు నేర్పిందల్లా మర్చిపోయావా? ప్రాణం ఔన్నత్యం గురించి నీకు తెలీదా?

తండ్రీ అలా మాట్లాడవద్దు. అది జింక మాత్రమే.

అప్పుడు నాకు తెలియవచ్చింది. ఎక్కడో... ఏదో తప్పు జరిగింది...

నీవు ఈ అడవిలో స్వేచ్ఛగా పెరిగావు.




నీవు థార్సిక్‌లోకి మారుతున్నప్పుడు నేను చెప్పాను...
నాకు నిజం చెప్పు! నేను నీ తండ్రిని!
సెల్యూంకీకి నాగురించి చెప్పమని నేను అతడిని బలవంతపెట్టలేదు. అతడికి తన శక్తుల పట్ల ఎంత నమ్మకం అంటే ఇతరులు ఉద్బోధిస్తుంటే కూడా ఆపడానికి నిరాకరించాడు.
నీవు నా తండ్రివి కావు.
వారు ఎలా కలుసుకున్నారో,
చెప్పాడు.



# రామాయణం



మర్నాడు తెల్లవారుతూనే లవణుడు ఆహారం సంపాదించడానికై మధుపురం దాటి బయటికి వెళ్లాడు. ఆ సమయంలో శత్రుఘ్నుడు యమునా నదిని దాటి మధుపుర ద్వారం వద్ద నిలబడ్డాడు. మధ్యాన్నం రెండు జాములయే సరికి లవణుడు తాను చంపిన జంతువుల న్నిటినీ మోస్తూ తన నగరానికి తిరిగి వచ్చి, ద్వారం వద్ద ఉన్న శత్రుఘ్నుడిని చూసి, విర గబడి నవ్వుతూ, ''ఒరే మనిషీ, నాకు ఆహారం కావడానికా వచ్చావు? ఇవాళ నాకు మంచి విందే!'' అన్నాడు.

రోషంతో శత్రుఘ్నుడి కళ్లు ఎర్రబడ్డాయి. ''నీతో యుద్ధం చేసి, నిన్ను చంపడానికి వచ్చానురా, లవణుడా! నేను దశరథ మహా రాజు కొడుకును, రాముడి తమ్ముడిని, నా పేరు శత్రుఘ్నుడు. ఇవాళ నా చేత నీకు చావు తప్పదు,'' అన్నాడతను.

లవణుడు వెటకారంగా నవ్వి, ''నాకు మామ వరుస అయిన రావణుణ్ణి మీ అన్న చంపినా నేను లక్ష్యపెట్టలేదు. నేను మహామహా వాళ్లనే చంపాను. నాకు మీవంటివాళ్లు గడ్డితో సమానం. నన్నెవరూ జయించలేరు. నాతో యుద్ధం చెయ్యవచ్చావుగా? ఉండు, నీ తీట తీరుస్తాను. నన్ను వెళ్లి ఆయుధం పట్టుకు రానీ,'' అన్నాడు.

''నా కంటబడిన నిన్ను ప్రాణాలతో పోనిస్తా ననుకున్నావా? నిన్ను ఈ క్షణంలోనే చంపే స్తాను,'' అన్నాడు శత్రుఘ్నుడు.

ఉత్తరకాండ 4



లవణుడు పళ్ళు కొరికి, చేతులు పిసుక్కుని, చెట్లు పెరికి శత్రుఘ్నుడిపైన విసరసాగాడు. శత్రుఘ్నుడు ఆ చెట్లనన్నిటినీ తన బాణాలతో నరికాడు. కాని ఒకచెట్టు తల మీద తగిలి శత్రుఘ్నుడు మూర్ఛపోయాడు. అది చూసి, శత్రుఘ్నుడు చచ్చాడనుకుని, లవణుడు తాను చంపిన మృగాల మోపు నెత్తుకుని బయలుదేరేటంతలో శత్రుఘ్నుడు మూర్ఛ తెలిసి ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. మరుక్షణమే అతడు, రాముడు తనకు ఇచ్చిన బాణాన్ని ధనువుకు సంధించి, లవణుడిపైకి వదిలాడు. అది నిప్పులు కక్కుతూ వెళ్ళి, లవణుడి గుండెను చీల్చింది. లవణుడు చచ్చాడు. వెంటనే వాడి ఇంట ఉండే త్రిశూలం శివుడి వద్దకు వెళ్ళిపోయింది.

తరువాత శత్రుఘ్నుడు తన సేనను పిలిపించి, మధుపురాన్ని ఆక్రమించి, దానికి రాజై పాలించసాగాడు. పన్నెండేళ్ళు గడిచాక అతనికి రాముణ్ణి చూడాలనిపించింది. అతను కొద్ది సేననూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని, అయోధ్యకు బయలు దేరి, వాల్మీకి ఆశ్రమంలో ఒక రాత్రి మజిలీ చేశాడు.

వాల్మీకి శత్రుఘ్నుడికి అర్ఘ్యపాద్యాలిచ్చి, ఆతిథ్యం జరిపి, అతనికీ, అతని సేనకూ, పరివారానికీ సంతుష్టిగా భోజనాలు పెట్టించాడు. భోజనాలయాక వారంతా వాల్మీకి రచితమైన రామకథను రాగతాళాలతో సహా విని ఎంతో అద్భుతం చెందారు.

ఆ రాత్రంతా రామకథను వినటంలోనే గడిచిపోయింది. మర్నాడు శత్రుఘ్నుడు వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, అయోధ్యకు వెళ్ళి, రాముణ్ని చూసి, ''అన్నా నీ ఆజ్ఞానుసారం లవణుడిని చంపి అతడి రాజ్యాన్ని ఏలుతున్నాను. కాని పన్నెండేళ్ళ పాటు నిన్ను చూడక తహతహపుట్టి బయలు దేరి వచ్చాను.'' అన్నాడు.

రాముడు శత్రుఘ్నుడిని కౌగలించుకుని, ''నాయనా, రాజుకు రాజ్యం చేయక తప్పదు గద. నీ రాజ్యం నీవు చూసుకో. ఎప్పుడన్నా నన్ను చూడాలనిపిస్తే వస్తూ ఉండు,'' అని అతడిని పంపేశాడు.

భరతలక్ష్మణులు సపరివారంగా బయలు దేరి, శత్రుఘ్నుడిని చాలా దూరం సాగనింపి, వెనక్కు తిరిగి వచ్చారు.

తరవాత కొన్ని రోజులకు ఒక పల్లెటూరి బ్రాహ్మణుడు తన అయిదేళ్ళ కొడుకు శవం తెచ్చి రాజద్వారం దగ్గిర నిలబడి ఏడవడం మొదలుపెట్టాడు. తనకున్న ఒకే కొడుకు అకాలమరణం పొందినందుకు ఏడుస్తూ,

రాజు సరిగా పాలిస్తే ఇలాంటి అకాల మరణా లుండవనీ, ఇన్నాళ్లకు ఇక్ష్వాకుల పరిపాల నలో రాముడి హయాంలో దేశం దిక్కుమాలి నదయిందనీ అన్నాడు.

రాముడీ సంగతి తెలుసుకుని చాలా చింతించి, తన మంత్రులనూ, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులనూ పిలిపించి, వారితో బ్రాహ్మణ బాలుడి అకాల మరణం గురించి చెప్పాడు. ఒక శూద్రుడు తపస్సు చేస్తున్నాడనీ, అది యుగ ధర్మానికి విరుద్ధమనీ, అందుకే ఈ బాలుడు చనిపోయాడనీ నారదుడు రాముడితో అన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "నీవు వెళ్లి ఆ బ్రాహ్మణుడిని ఓదార్చి, ఆ బాలుడి కళేబరాన్ని తైలభాండంలో భద్రంగా ఉంచు." అన్నాడు. తరవాత అతను ఆయుధాలు తీసుకుని పుష్పకం ఎక్కి, పడమరా, ఉత్తరమూ గాలించి, చివరకు దక్షిణ దిక్కున ఒక సరస్సులో తల కిందుగా తపస్సు చేస్తున్న మనిషి నొకడిని చూశాడు.

అతను విమానం దిగి ఆవ్యక్తిని సమీపించి, "నేను రాముడిని, దశరథ మహారాజు కొడు కును, తెలుసు కోవాలన్న కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. నీవే జాతి వాడివి? ఏం కోరి ఈ కఠోర తపస్సు చేస్తున్నావు?" అని అడి గాడు. తలకిందులుగా ఉండే ఆ తాపసి, "రాజా, నేను శూద్రుడిని, నా పేరు శంబూ కుడు. బొందితో స్వర్గానికి పోగోరి నేనీ తపస్సు చేస్తున్నాను," అన్నాడు. అతనింకా మాట్లాడు తూండగానే రాముడు తన కత్తి దూసి శంబూ కుడి తల నరికేశాడు.



వెంటనే దేవతలు రాముడి పైన పుష్పవర్షం కురిపించి, దుందుభులు మోగించి, "రామా, ఈ శూద్రుడు స్వర్గానికి రాకుండా చేశావు. మాకంతే చాలు. ఏం వరం కోరుతావో కోరు," అన్నాడు. "అకాలమరణం పాలయిన ఆ బ్రాహ్మణ బాలుడిని బతికించండి," అన్నాడు రాముడు. "శంబూకుడి తల తెగిన క్షణంలోనే ఆ బాలుడు బతికాడు," అంటూ దేవతలు వెళ్లిపోయారు.

రాముడక్కడినుంచి, ఆ సమీపంలోనే ఉన్న అగస్త్యాశ్రమానికి వెళ్లి ఆ ముని ఇచ్చిన అతిథి సత్కారాలు స్వీకరించాడు.

అగస్త్యుడు రాముడి కొక ఆభరణాన్ని బహూకరించాడు. రాముడు దాన్ని స్వీకరించి, "స్వామీ ఇది దివ్యాభరణంలాగున్నది. ఇది తమకు ఎవరిచ్చారు?" అని అడిగాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా అగస్త్యుడు శ్వేతుడి కథ చెప్పాడు.



వెయ్యి యోజనాల విస్తృతి గల ఒక అరణ్యం ఉండేది. దాని మధ్య యోజనం చదరం గల సరస్సుండేది. ఆ అరణ్యంలో ఒక్క పక్షిగాని, మృగం గాని ఉండేది కాదు. సరస్సుకు సమీపంలో ఒక ఆశ్రమం ఉండేది. అగస్త్యుడా ఆశ్రమానికి వెళ్ళి, ఒక రాత్రి అందులో గడిపి, తెల్లవారుజామున సరస్సు వద్దకు వెళ్ళాడు. దాని ఒడ్డున ఆయన కొకపుష్టి గల శవం కనబడింది.

అది ఏ మాత్రమూ చెక్కు చెదరలేదు. అది ఏవిధమైన శవం అయి ఉంటుందా అని అగస్త్యుడు ఆలోచిస్తుండగా, అక్కడ ఒక విమానం ఆకాశం నుంచి దిగింది. అదొక దివ్య విమానం. అందులో ఒక దివ్య పురుషుడూ, అతన్ని సేవిస్తూ అనేక మంది అప్సరసలూ ఉన్నారు. అప్సరసలలో కొందరు పాడుతు న్నారు. కొందరు వాద్యాలు వాయిస్తున్నారు, మరికొందరు నృత్యాలు చేస్తున్నారు.

కొంతసేపయాక ఆ దివ్యపురుషుడు విమానం నుంచి దిగి, సరస్సు తీరాన ఉన్న శవాన్ని తిని, సరస్సులో చెయ్యీ, నోరూ కడు క్కుని, తిరిగి విమానం ఎక్కబోయాడు. అదంతా చూస్తూండిన అగస్త్యుడు, ''అయ్యా, నీవెవరు? ఇలాంటి పనికిమాలిన భోజనం చెయ్యడానికి కారణం ఏమిటి? ఎంతహీనులు కూడా ఇలాంటిపని చేయరు గదా!'' అన్నాడు.

ఆ దివ్య పురుషుడు అగస్త్యుడికి తన పూర్వ కథ చెప్పాడు. అతను విదర్భ రాజైన సుదేవుడి కొడుకు. అతడి పేరు శ్వేతుడు. సుదేవుడి కిద్దరు భార్యలు, ఇద్దరికీ ఇద్దరు కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడీ శ్వేతుడు. తన తండ్రి అనంతరం చాలాకాలం రాజ్యం ఏలి, చివరకు సురథుడికి పట్టం కట్టి, తాను తపస్సు చేసుకున్నాడు. దీర్ఘ తపస్సు చేసి అతను దేహం చాలించి, బ్రహ్మలోకానికి వెళ్ళాడు. కాని, బ్రహ్మలోకంలో కూడా అతడిని ఆకలి దప్పులు విడవలేదు. అది చూసి కంగారు పడి అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, బ్రహ్మలోకంలో కూడా తనను ఆకలిదప్పులు వేధించడానికి తాను ఏం తప్పు చేసి ఉండాలని అడిగాడు.

దానికి బ్రహ్మ, ''జంతువులు లేని అడ విలో నీకు భోజన సంతుష్టి ఏమాత్రమూ లభించలేదు. అదీకాక నీవు అస్తమానమూ తపస్సులో ఉండి అతిథులకు భోజనం పెట్ట లేదు. అందుకే నిన్ను ఆకలి దప్పులు వదల కుండా ఉన్నాయి. అరణ్యంలో ఉన్న నీ శవాన్నే తిని నీ ఆకలి దప్పులను తీర్చుకుంటూ ఉండు. కొంత కాలానికి అక్కడకు అగస్త్యుడు వచ్చి, నీ ఆకలిదప్పులను పూర్తిగా పోగొడ

తాడు,'' అని చెప్పాడు. తనను పలకరించిన వాడు అగస్త్యుడేనని తెలియగానే ఆ దివ్య పురుషుడు, ''స్వామీ, నన్ననుగ్రహించి, నాకీ కష్టం తొలగించండి. దానికి ప్రత్యుపకారంగా ఈ ఆభరణం స్వీకరించండి. ఇది ప్రతి రోజూ బంగారాన్నీ, ధనాన్నీ, బట్టలనూ, ఆహారాన్నీ, నగలనూ ఇస్తూ ఉంటుంది.'' అన్నాడు.

అగస్త్యుడా ఆభరణాన్ని స్వీకరించగానే శవం కాస్తా శిథిలమైపోయింది. దివ్యపురుషుడు సంతోషించి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

రాముడీ కథ విని అగస్త్యుడితో ''స్వామీ, శ్వేతుడు తపస్సు చేసిన వనంలో మృగాలూ, పక్షులూ లేకపోవటాని కేమిటి కారణం?'' అని అడిగాడు. ఆ కథను అగస్త్యుడీ విధంగా చెప్పాడు. కృతయుగంలో మనుచక్రవర్తి తన కొడుకైన ఇక్ష్వాకుడికి పట్టం గట్టి, తాను బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. ఇక్ష్వాకు నూరుగురు కొడుకులను కన్నాడు. వారిలో ఆఖరివాడు దండుడు. అతడు బుద్ధిహీనుడు. ఆ దండుడికి ఇక్ష్వాకు వింధ్యశైవల ప్రాంతాల మధ్య రాజ్యం ఇచ్చాడు. దండుడు అక్కడ మధుమంతమనే చక్కని నగరం నిర్మించుకుని శుక్రాచార్యులను గురువుగా పెట్టుకుని, రాజ్యం చేస్తూ వచ్చాడు.

శుక్రాచార్యులకు అరజ అనే అందమైన కూతురుండేది. ఒకనాడు దండుడు వనంలో తిరుగుతూ, ఒంటరిగా ఉన్న అరజను చూసి ఆమెను కోరాడు. అరజ, తాను శుక్రాచార్యులు కూతురిననీ, దండుడు వెర్రిమొర్రి వేషాలు వేస్తే తన తండ్రి ఘోరమైన శాపం ఇస్తాడనీ హితవు చెప్పింది. కాని మందమతి అయిన దండుడు అరజ హితబోధ వినక, ఆమెను బలాత్కరించాడు. అతను మధుమంతానికి తిరిగి వెళ్ళాక, అతడి దుష్ప్రవర్తన శుక్రుడికి తెలిసింది. మధుమంతం చుట్టూ నూరు యోజనాల మేర ఏడు రోజుల పాటు ధూళివర్షం కురిసి సమస్తమూ నశించి పోవాలని, శుక్రాచార్యుడు శపించాడు. ఈ శాపం సంగతి వింటూనే అక్కడ నివసించే వారందరూ ఆ ప్రాంతం వదలి వెళ్ళిపోయారు. శుక్రుడు చెప్పినట్లే ఆ ప్రాంతలో వారం రోజుల పాటు ధూళివర్షం కురిసి నాశనమైపోయింది.

ఈ కథలు వింటూ రాముడు అగస్త్యాశ్రమంలో కొంతసేపుండి, ఆ మహాముని వద్ద సెలవు పుచ్చుకుని అయోధ్యకు వచ్చేశాడు.





# పంచతంత్ర కథలు



సాలెవాడి భార్య చేసిన మాయ అంతా కళ్లారా చూసిన దేవశర్మ తనలో, ''ఆహా, స్త్రీలు ఎంత మాయలమారివాళ్లు! వాళ్ల తెలివితేటల ముందు శుక్రుడూ, బృహస్పతీ ఎందుకు పనికి వస్తారు?'' అనుకున్నాడు. ఈ లోపల మంగలి స్త్రీ, తెగిపోయిన ముక్కును చేత బట్టుకుని, ''ఏం చెయ్యాలా, తెగిపోయిన ముక్కును ఎలా కప్పిపెట్టాలా'' అని ఆలోచిస్తూ ఇంటికి వెళ్లింది.

ఇంతలో తెల్లవారింది. రాత్రి అంతా రాజభవనంలోనే ఉండిపోయిన దాని భర్త వచ్చి, ''నా పొది ఇలా తీసుకురావే'' అన్నాడు. తెలివిగల మంగలామె కత్తి మాత్రమే బయటకు విసిరేసింది. పొది ఇవ్వమంటే ఒక్క కత్తి మాత్రమే పారేసిందని భార్య మీద మండిపడి, మంగలి ఆ కత్తిని ఆమె కేసి విసిరి కొట్టాడు. వెంటనే ఆమె చేతులు పైకెత్తి, ''రక్షించండి! రక్షించండి! దుర్మార్గుడు, నా మొగుడు, నా ముక్కు కాస్తా కోసేశాడు!'' అని కేకలు పెట్టింది.

ఆ కేకలు విని రక్షకభటులు పరిగెత్తుకుంటూ వచ్చి, మంగలిని చావతన్ని, అతడినీ, అతడి భార్యనూ, తెగిన ముక్కునూ తీసుకుపోయి న్యాయాధికారుల ముందు పెట్టి, ''ఈ దుర్మార్గుడు ఈ స్త్రీరత్నాన్ని అకారణంగా హింసించాడు. వీడికి ఏ దండన విధిస్తారో విధించండి,'' అన్నారు.

న్యాయాధికారి మంగలిని, ''ఇలాంటి ఘోరం ఎందుకు చేశావు? నీ భార్య ఏం చేసింది?'' అని అడిగారు. అసలే మూఢుడైన మంగలికి జరుగుతున్నది అర్థం కాక, మౌనంగా ఉండిపోయాడు. న్యాయాధికారులు శిక్షాస్మృతులన్నీ తిరగవేసి, మంగలికి మరణదండన విధించారు. దేవశర్మ ఈ సంగతి వినటమే గాక, వధ్యస్థానానికి పోతున్న మంగలిని చూశాడు. అయన న్యాయాధికారుల వద్దకు పరిగెత్తి వెళ్లి, ''అయ్యలారా, ఈ అమాయకుడైన మంగలిని అన్యాయంగా చంపబోతున్నారు. నిజం నేను చెబుతాను వినండి. అనవసరమైన

మిత్రభేదం - 7



విషయాలలో జోక్యం చేసుకుని నక్కా, నేనూ, మంగలామే ఆపదలు తెచ్చుకున్నాం,'' అన్నాడు. ''అది ఎలా జరిగింది?'' అని న్యాయాధికారులు దేవశర్మను అడిగారు.

దేవశర్మ వారికి పోట్లాడుకున్న పొట్టేళ్ల కథా, తన బంగారం కాజేసిన ఆషాఢభూతి కథా, తప్పుతాగిన సాలెవాడి కథా వివరంగా చెప్పాడు.

న్యాయాధికారులు దేవశర్మ చెప్పిన కథలను ఆశ్చర్యంతో విని, వెంటనే మంగలిని విడుదల చేశారు. కాని వారు మంగలి భార్యను విడిచి పెట్టక, ఆమె చెవులు కూడా కోయించి, ఆమె చేసిన దుర్మార్గానికి శిక్ష పూర్తి చేశారు.

నక్క పొందిన శిక్షా, మంగలామె పొందిన శిక్షా చూసిన మీదట దేవశర్మకు తన బంగారం పోయిందన్న విచారం పోయింది. ఆయన తన మఠానికి తిరిగివచ్చి, శివుడి ముందర సాష్టాంగ పడి, ''మహాదేవా, నీ దయవల్ల మా ముగ్గురి లోనూ తక్కువ ఆపద పొందిన వాణ్ణినేనే. రక్తదాహంతో నక్క తన ప్రాణాలనే పోగొట్టుకు న్నది. మంగలిది ముక్కూ చెవులూ పోగొట్టు కున్నది. నీ అనుగ్రహం చేత బంగారం మీది వ్యామోహంతో బంగారాన్ని మాత్రమే పోగొట్టు కున్నాను. ఇక దాన్ని కోరను,'' అన్నాడు....

దమనకం చెప్పిన దేవశర్మ కథ విని కరటకం, ''సరే మనం ఇప్పుడు ఏం చెయ్యాలి?'' అని అడిగింది.

దానికి దమనకం ''తప్పు తోవలో పడి పోయిన మన రాజును సరి అయిన తోవకు మళ్లించాలి. కేవలం ఎద్దు స్నేహాన్ని, సల హానూ పురస్కరించుకుని మన రాజు గడ్డి తినే నీతి అవలంబించటం జరిగింది. ఆయనను అటు నుంచి మళ్లించాలి,'' అన్నది.

''మనవంటి దుర్బలులకు అది ఎలా సాధ్యం?'' అని కరటకం అడిగింది.

''దేహబలం చాలనప్పుడు యుక్తులు పని చేస్తాయి. భయంకరమైన పామును చంప టానికి ఆడకాకి బంగారు హారాన్ని ఉపయో గించలేదా?'' అన్నది దమనకం;

''ఆ కథ ఏమిటి?'' అని కరటకం అడి గింది.

దమనకం ఇలా చెప్పింది.

### పామును చంపిన కాకుల కథ:

ఒక ప్రాంతంలో ఒక పెద్ద మర్రిచెట్టు ఉండేది. దానిమీద ఒక కాకుల జంట నివసించేది. ఆ కాకులు పొదిగిన పిల్లలను ఒక పాము తిని పోసాగింది. చాలా కాలంగా అదే చెట్టు మీద ఉంటున్న ఆ కాకులకు పిల్లలు దక్కటం లేదన్న విచారం ఉన్నప్పటికీ, చెట్టును విడిచి పోబుద్ధి కాలేదు. పాము ప్రతి రోజూ విడవ

కుండా చెట్టు ఎక్కి వచ్చి, కాకి పిల్లలను మింగేస్తూ ఉండటం చేత ఒక్క పిల్ల అయినా బతికి బట్టకట్టటం జరగలేదు.

చిట్టచివరకు ఆడకాకి ''ప్రాణనాథా, దుష్ట సర్పం మన పిల్లలందరినీ పొట్టబెట్టుకున్నది. మనకు పుట్టబోయే పిల్లల గతి కూడా ఇంతే అవుతుంది.

అందుచేత మనం ఇంకెక్కడికైనా పోయి, దూరాన మరొక చెట్టుమీద నివాసం ఏర్పాటు చేసుకుందాం. కన్న పిల్లల మీది ప్రేమా, వారు మరణిస్తే కలిగే శోకమూ, ఇంతా అంతా కాదు. అందుచేత మనం వేరొక చోటికి పోదాం, అన్నది.''

దానికి మగకాకి, ''ప్రియా, మనం ఎంతో కాలంగా ఈ చెట్టును ఆశ్రయించి ఉన్నాం. అందుచేత నాకు దీన్ని వదిలి పెట్టడం ఇష్టం లేదు. పిడికెడు గడ్డీ, పుడిసెడు నీరూ మాత్రమే కోరే లేడి ఎక్కడైనా బతకగలదు; కాని అది ఎన్ని అపాయాలకైనా ఓర్చి తన జన్మస్థానమైన అరణ్యంలోనే ఉంటుంది. లేడి కూడా చెయ్యని పని, తెలివితేటలు గల కాకులం చెయ్యటమా? ఏదో ఒక ఉపాయం చేత నేనీ పాపిష్టి పామును చంపేస్తాను,'' అన్నది.

''అది విషసర్పం. దాన్ని ఎలా చంపు తావు?'' అని ఆడకాకి అడిగింది.

''నేను స్వయంగా ఆ పని చెయ్యలేక పోతే నేం? ధర్మశాస్త్రమూ, రాజనీతీ తెలిసిన ఉద్దండ పండితులైన మిత్రులున్నారు. నేను వారితో సంప్రదించి, వారి సలహా పొంది శ్రీఘ్రమే ఈ పామును చంపేస్తాను,'' అన్నది మగ కాకి.

అది రోషంతో ఎగిరిపోయి మరొక చెట్టును చేరి, అక్కడ నివసించే తన ఆప్రమిత్రుడైన నక్కను పిలిచి, తనకు వచ్చిన కష్టం చెప్పుకుని, ''మిత్రమా, మా పిల్లలనన్నిటినీ పొట్టన పెట్టుకున్న దుర్మార్గపు పామును చంపటానికి మంచి ఉపాయం ఉంటే చెప్పు.'' అన్నది.

దానికి నక్క, ''నేనొక చక్కని ఉపాయం ఆలోచించాను. ఇక నీ కష్టాలు గట్టెక్కు తాయి. చెడ్డపనులు చేసేవారు నది ఒడ్డున ఉన్న చెట్టులాగా తమకు తామే నాశనమైపోతారు. వెనకటికి కొంగ చేపలన్నిటినీ తిని కూడా తృప్తి తీరక చివరకు ఎండ్రకాయ చేత చావ లేదా?'' అన్నది.

''ఏమిటా కథ?'' అని మగకాకి అడిగింది.





# సగం ధర

కూనయ్యకు పదెకరాల పొలమూ, ఊళ్లో చిన్న చిల్లరకొట్టూ ఉన్నాయి. అయినా, అతడు పరమ పిసినారిగా పేరు పడ్డాడు. పంట నూర్పిళ్ల సమయంలో ఒకనాడు కూనయ్య, భార్యను కొట్లో కూర్చోబెట్టి, తను కళ్లానికి వెళ్లాడు.

కళ్లంలో ధాన్యం రాసిగా పోసి ఉన్నది. నూర్పిళ్లు పూర్తయ్యాక ఎంతో కొంత పేదలకు దానం చేయడం రైతులకు అలవాటు. కూనయ్య పిసినారి గుణం తెలిసిన వాళ్లు, కావడంతో ఒక్కరు కూడా అతని కళ్లంకేసి రాలేదు. చుట్టుపక్కల కళ్ళాల్లో రైతులు, పేదలకు ధాన్యం దానం చేసినట్టు అనిపించుకోవాలని, అతడు ఒకవంతు మంచి ధాన్యంతో మూడు వంతులు తాలు ధాన్యం కలిపి, దూరంగా ఉన్న కొందరు పిల్లలను దగ్గరికి పిలిచి, వాటిని వాళ్లకు దానం చేశాడు!

పిసినారి దానగుణాన్ని, దూరంనుంచి చూసిన ఒక పెద్దమనిషి ఆశ్చర్యపడి, పిల్లలను దగ్గరికి రమ్మని, కూనయ్య దానం చేసింది తాలుధాన్యం అని గ్రహించి, ఏం చేయాలో వాళ్లకు చెప్పి పంపాడు. కూనయ్య ధాన్యం బస్తాలకెత్తించి, ఇల్లు చేరేసరికి, భార్య, కొట్లో ఉన్న ధాన్యం కుప్పను భర్తకు చూపుతూ, ''ఎవరో ధర్మాత్ముడు ధాన్యం దానం చేశాడని చెప్పుకుంటూ కొందరు పిల్లలు వీధిలో వెళుతూ ఉంటే, పిలిచి, ఆ ధాన్యాన్ని సగం ధరకే కొనేశాను!'' అన్నది సంతోషంగా.

ఆ ధాన్యాన్ని చూసేసరికి కూనయ్యకు గుండె ఆగినంత పనయింది. ఎందుకూ పనికిరాని తమ సొంత తాలు ధాన్యాన్ని, సగం ధరకు కొన్న భార్య తెలివితక్కువతనానికి, కూనయ్య ఎంతగానో బాధపడ్డాడు.

– దాసరి వెంకటరమణ



# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు ఆగస్ట్ 2010 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానం పంపిన విజేతకు రూ. 500 బహుమతి ఉంటుంది.

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 6 | | 4 | 2 | | | 8 | |
| | 2 | 1 | 5 | | | 7 | | 6 |
| | | | | | 6 | | 2 | |
| | 1 | 4 | 2 | 7 | | 5 | | 3 |
| | | 3 | | | | 8 | | |
| 6 | | 5 | 9 | | 3 | 2 | 1 | |
| | 9 | | 6 | 1 | | 4 | 5 | |
| | | 8 | | 9 | | | | |
| | 4 | | | | 2 | | 3 | 1 |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | 3 | | 6 | | 9 | 4 | |
| | 4 | | | | | | | |
| 9 | | 2 | | 8 | | | | |
| 2 | | | | | 3 | | | |
| | 9 | | | | 4 | | | |
| | | | 8 | | | | 1 | 3 |
| 8 | 5 | | | | 1 | | | 6 |
| 4 | | | | 7 | 5 | | | |
| | | | 9 | | | 4 | | |

మీ ఎంట్రీలను 2010 జూన్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా: **Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. e-mail your entries to:contests@chandamama.com

ఏప్రిల్ 10 ఏప్రిల్ నెల సమస్యకు సరైన సమాధానం:

కార్ల సమస్యను మీరు వేగంగా పరిష్కరించ గలిగారా? అన్ని పరివర్తనలను మొత్తం సమస్యకు సమీపంగా తీసుకురావడం ఎలా అన్నది ప్రశ్న. కిలోమీటర్లను మైళ్ళుగా మార్చడానికి కింది పద్ధతి మీకు సులభమైన, వేగవంతమైన మార్గాన్ని చూపిస్తుంది.

లెక్కలో మూడు విలువలు మాత్రమే మైళ్లలో ఉన్నాయి కాబట్టి కిలోమీటర్లనుండి మైళ్లలోకి వేగంగా మార్చవచ్చు.

ఈ సమస్యను కింది పద్ధతిలో వేగంగా పరిష్కరించవచ్చు.

దశ 1: కిలోమీటర్లలో ఉన్న విలువలను 8 చేత భాగించండి.

80/8 = 10: 96/8 = 12

దశ 2: ఫలితాన్ని 5 చేత హెచ్చించండి.

10 x 5 = 50: 2 x 5 = 60

కాబట్టి, 80 కి.మీ = 50 మైళ్లు,

96 కి.మీ = 60 మైళ్లు.

ఎ వేగం = 50 మైళ్లు.

డి 65 కి.మీ వేగంతో ప్రయాణిస్తున్నందున అతడే వేగవంతమైన భాగస్వామి.

కాబట్టి, వేగవంతమైన భాగస్వామి డి అని ఇప్పుడు అందరికీ తెలుసు. ఎ మరియు డి వేగం మధ్య వ్యత్యాసాన్ని కనుగొనడమే సమస్య.

కాబట్టి, ఎ మరియు డి వేగానికి మధ్య వ్యత్యాసం.

65 - 50 = 15 మైళ్లు.

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 17

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

***Co-sponsored by Infosys FOUNDATION, Bangalore***

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 17 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూన్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. ఆగస్ట్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## శ్రీ మహావిష్ణువు



1. వేదవ్యాసుడు చెబుతుండగా మహాభారతాన్ని వాస్తవంగా రాసినది ఎవరు?
2. వైకుంఠం ద్వారపాలకులు ఎవరు?
3. పురాణాల ప్రకారం విష్ణువు తొలి అవతారం ఏది?
4. రాముడు ఏ యుగానికి సంబంధించినవాడు?
5. రావణుడి వాహనం ఏది?
6. విష్ణువు రాక్షసులను వంచించడానికి ధరించే స్త్రీ రూపమేది?
7. పార్థుడు మహాభారతంలో ఒక కథానాయకుడి పేరు. అతడి పేరు చెప్పండి.
8. దేవతల శిల్పి ఎవరు?

## అభినందనలు

బి. వెంకటరమణ,
రైల్వేస్టేషన్ రోడ్,
చింతపర్తి, చిత్తూరు జిల్లా,
ఆంధ్రప్రదేశ్.

## ఏప్రిల్' 10 ఫోటో వ్యాఖ్యల పోటీ విజేత





ఆటల కోసం వచ్చాం!
గింజల కోసం గుమిగూడాం!!

## బోనులో పక్షి

బౌ- డ్రిల్ సూత్రాన్ని ఈనాటికీ వడ్రంగులు ఉపయోగిస్తున్నారు. 'దృష్టి నిరంతరాయత' అనే ఈ భావనను ప్రదర్శించడానికి అతి సరళంగా ఉండే ఈ జానపద బొమ్మను మనం ఉపయోగించవచ్చు.





కావలసినవి:

- ఉపయోగించిన స్కెచ్-పెన్‌కేస్
- 40సెం.మీ.పొడవైన కొబ్బరి ఈనె
- 40సెం.మీ. పొడవైన లావుదారం
- పాత రీఫిల్
- కార్డ్ షీట్ ముక్క

ఎలా చేయాలి?

- వాడి వదిలేసిన స్కెచ్ పెన్ నుండి ఇంకు లేని 6 సెంటీమీటర్ల పొడవైన సిలిండర్ రూపంలోని గొట్టాన్ని కత్తిరించండి. స్కెచ్-పెన్‌కేస్‌కు ఒక చివరలో పెద్ద సూదితో రంధ్రం చేయండి. ఈ రంధ్రంలో దారం దూర్చండి. దారం రెండు కొసలను బలమైన కొబ్బరి ఈనెకు చుట్టి విల్లులాగా వంచి కట్టండి.
- పాత బాల్‌పెన్ రీఫిల్ తీసుకుని దానిని స్కెచ్-పెన్ ఒక కొసలో దూర్చి దారాన్ని తొలగించండి.
- రీఫిల్‌ను 180 డిగ్రీల కోణంలో తిప్పుతూ దానిని దారం కొసలు రీఫిల్ చుట్టూ చేరేలా రీల్ లోపల చొప్పించండి.
- మూడు సెంటీమీటర్ల పొడవున్న కార్డ్ షీట్‌లో చెరొకవైపున పక్షిని, బోనును రూపొందించి దాన్ని రీఫిల్ పై భాగంలో బంకతో అంటించండి.

కాన్సెప్ట్:

మనం వస్తువులను కళ్లతో చూస్తాం. అయితే వస్తువును దాని స్థానంలోంచి తొలగించిన తరవాత కూడా క్షణకాలంపాటు దాన్ని మనం చూడగలం. దీనినే దృష్టి నిరంతరాయత అని పిలుస్తున్నారు. కార్టూన్ సినిమాలను తీయడం వెనుక ఉన్న ప్రాథమిక సూత్రం ఇదే. ఒక సెకనుకాలంలో మీ కంటి రెటీనాలో 20 చిత్రాలు ప్రతిఫలిస్తాయి.

రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రోఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)



# రాజ ద్రోహం



కళింగ దేశాన్ని రిపుంజయుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. అతడు పేరుకు తగ్గట్టే శత్రువులకు అరివీర భయంకరుడు, ప్రజలకు అభయంకరుడు. ఇరుగు పొరుగు రాజ్యాలు తనను కన్నెత్తి చూడలేని విధంగారిపుంజయుడు పాలనను కట్టుదిట్టం చేసినప్పటికీ, అంతర్గత బెడద ఒకటి కళింగదేశాన్ని పట్టి పీడించసాగింది.

ఆ దేశరాజధాని కుంచిపేటను ఆనుకుని పెద్ద అడవి ఉండేది. ఆ అడవికి ఆవలనున్న గ్రామాలనుండి ప్రజలు రకరకాల పనుల మీద రాజధానికి అడవిగుండా రాకపోకలు సాగిస్తుండేవారు.

విలువైన ఆభరణాలు, ధనరాశులతో అడవిని దాటే బాటసారులకు దారికాసి దోచుకునే దోపిడీ దొంగల బెడద అధికంగా ఉండేది.

మొదట్లో చీకటి పడ్డాక మాత్రమే జరిగే దోపిడీలు రానురానూ పట్టపగలే దోచుకునే స్థాయికి మితిమీరి పెరిగాయి.

దోపిడీ దొంగల ఆగడాలు అరికట్టేందుకు ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నట్లు సేనాధిపతి ప్రసేనుడు పదే పదే చెబుతున్నా ఫలితం కానరాకపోవడంతో రిపుంజయుడు తీవ్ర అసహనానికి గురవసాగాడు. ఇక ఈ సమస్యను తానే స్వయంగా పరిష్కరించడానికి పూనుకుని ఒక నాటి సాయంత్రం మారువేషంలో ఒంటరిగా అడవికేసి బయలుదేరాడు.

కొద్దిగా చీకటి పడేసరికి వర్తకుని వేషంలో ఉన్న రిపుంజయుడు అడవి మధ్య ప్రాంతానికి చేరుకున్నాడు.

ఊహించినట్లే ఒక దొంగల ముఠా హఠాత్తుగా అతన్ని చుట్టుముట్టింది. దొంగల ఆనవాళ్లు గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తూనే తనవద్ద ఉన్న నకిలీ ఆభరణాల మూట వారు కొల్లగొట్టే అవకాశం కల్పించాడు రిపుంజయుడు.

అతన్ని నిలువుదోపిడీ చేసి మెరుపులా మాయమయ్యిందా దొంగలముఠా. వర్తకుని వేషంలో కాలినడకన వెళ్లిన రిపుంజయుడు

మల్లారెడ్డి మురళీ మోహన్

అశ్వాల మీద పారిపోయిన దొంగలముఠాని వెంబడించే అవకాశం లేక రాజధాని కేసి వెను దిరిగాడు.

ప్రత్యక్షంగా దొంగలబారిన పడ్డ రిపుంజయుడు ఈ సమస్యను సమూలంగా అంతం చేయాలన్న దృఢ సంకల్పంతో తన అధికార గణాన్ని అత్యవసరంగా సమావేశపరిచాడు.

ఆస్థానంలో మహామంత్రి, సేనాధిపతి, ఉపసేనాధి పతులూ అందరూ సమావేశమై ఉన్నారు. ఎవరికి తోచిన సలహా వారు వరుసగా వెలిబుచ్చసాగారు.

అదే సమయంలో తన వంతుగా ప్రసంగిస్తున్న ప్రసేనుడి వంక చూసిన రిపుంజయుడు ఒక్కసారిగా ఒకింత ఆశ్చర్యానికి లోనయ్యాడు. మరుక్షణంలోనే ఆగ్రహంతో కళ్ళెర్రజేసి, ''ఈ రాజద్రోహిని తక్షణమే బంధించండి!'' అని భటులను ఆదేశించాడు. ఈ హఠాత్పరిణామానికి మంత్రితో సహా అక్కడున్న వారంతా దిగ్భ్రమ చెందారు. కొంత సమయానికి తేరుకున్న మంత్రి, రాజు చర్యకు కారణం అడిగాడు.

''ఇన్నాళ్లుగా రాజధానికి సమీప అరణ్యంలో ఉన్న దొంగల ముఠాతో మన సేనాని ప్రసేనుడు కుమ్మక్కయిన విషయాన్ని మనం కనిపెట్ట లేకపోయాము. ఎన్ని ఉపాయాలు పన్నినా తప్పించుకోగలుగుతున్న దొంగల ముఠా ఆరా తీయాలని నేనే అరణ్యంలోకి మారువేషంలో వెళ్లా..'' అంటూ రిపుంజయుడు, మళ్లీ కొనసాగించాడు.

''ఆరోజు నేను దొంగలకి అడవిలో అందజేసిన మూటలోని ఒక నకిలీ హారం కారణంగా ఈ రోజు ప్రసేనుడే మనలను మోసగిస్తున్నట్లు రూఢి అంది. ఆ రోజు దొంగలు దోచుకుంది వర్తకుని వేషంలో ఉన్న నన్నేనని తెలియని ప్రసేనుడు వారిదగ్గర లంచంగా పుచ్చుకున్న హారం ధరించి నా కళ్లబడ్డం అతని గుట్టురట్టు చేసింది.'' అని ముగించాడు.

ప్రత్యక్షంగా దొరికిపోయిన రాజద్రోహి కి కఠినశిక్ష విధించారు. అసలు దొంగ అంతఃపురంలోనేపట్టుబడటంతో బందిపోటు దొంగలకు ఉన్న ఆధారం కాస్త పోయింది. అటు పిమ్మట ప్రసేనుడిఅండదండలు కొరవడినదొంగలముఠా రిపుంజయుడి భటుల ధాటికి ఎక్కువ కాలం మనలేకపోయింది. అంతటితో ఆ రాజ్యానికి దోపిడీ దొంగల బెడద శాశ్వతంగా తప్పింది.





# రాజోద్యోగం



కనకగుప్తుడు మహేంద్రపురి రాజకోశాగారానికి అధిపతి. కోశాగారం నిండి జమాఖర్చుల వివరాల నమోదుకు సంబంధించిన పని వత్తిడి అధికం కావడంతో, అతడు మరో ఇద్దరిని సహాయకులుగా నియమించేందుకు అనుమతి కోరాడు.

మంత్రి సరేనని, వాళ్లకు నెలకు పన్నెండు వరహాల జీతం ఇచ్చి కొలువులోకి చేర్చుకోమని చెప్పాడు. కాని, కనకగుప్తుడు ముగ్గురికి ఉద్యోగాలిచ్చాడు.

ఈ సంగతి విన్న మంత్రికి చాలా కోపం వచ్చింది. ఆయన కనకగుప్తుడిని, ఈ విషయమై ఏమీ ప్రశ్నించకుండా, నేరుగా రాజు రమాకాంతుడి దగ్గిరకు పోయి, ''ప్రభూ, మన కోశాగారాధిపతి కనకగుప్తుడు తనకు పని వత్తిడిగా వున్నదనీ, మరిద్దర్ని సహాయకులుగా నియమించుకుంటాననీ చెప్పి, నా అనుమతి కోరాడు. కాని, ఇప్పుడు నా సలహాను అతిక్రమించి ముగ్గురికి ఉద్యోగాలిచ్చాడు,'' అని ఆరోపించాడు.

''ఇది ఉత్తర్వులను ఉల్లంఘించడమే అవుతుంది. పైగా ఇది సరైన పద్ధతి కాదు.'' అన్నాడు రాజు కోపంగా. తర్వాత ఆయన కోశాధికారిని పిలిపించి సంజాయిషీ అడిగాడు.

''ప్రభూ, మంత్రిగారు మొదట్లో ఇద్దర్ని మాత్రమే ఉద్యోగంలోకి తీసుకుని, వారికి నెలకు తలొక పన్నెండు వరహాల జీతం ఇవ్వమని చెప్పింది వాస్తవం. అయితే , నేను జీతం ఎనిమిది వరహాలు చేసి ముగ్గురికి ఉద్యోగం ఇచ్చాను,'' అన్నాడు కోశాధికారి కనకగుప్తుడు.

రాజు అతడి కేసి కోపంగా చూస్తూ, ''నువ్వు అలా ఎందుకు చేశావో తెలుసుకునేందుకే నిన్నిక్కడికి పిలిపించాను,'' అన్నాడు.

కమలిని

కనకగుప్తుడు ఎంతో వినయంగా, ''ఆ ఉద్యోగాలకు మంత్రిగారే ఇద్దర్ని పంపారు. ఆ వ్యక్తులెవరో తెలిశాక మరొకడు కూడా ఉంటే మేలనిపించింది,'' అన్నాడు.

రాజు మందలిస్తున్నట్లు, ''నువ్వు చెప్ప దలిచినదేమిటో సూటిగా చెప్పడం అవ సరం,'' అన్నాడు.

అప్పుడు మంత్రి కల్పించుకుని, ''ప్రభూ, కోశాధికారి చెప్పినది వాస్తవమే. కాని, నేను పంపిన ఇద్దరూ చాలా నమ్మకస్తులు, సమ ర్థులు, ఆ కారణంవల్లనే, ఈ నియామకాల విషయంలో కొంత ఆసక్తి కనబరిచాను,'' అన్నాడు.

''చాలా మంచి పనిచేశారు మంత్రివర్యా! ధనంతో సంబంధించిన వ్యవహారం కాబట్టి కోశాగారంలో పని చేసేవాళ్లకు నిజాయితీకి తోడు సమర్థత కూడా అవసరమే,'' అని రాజు కనకగుప్తుడి కేసి చూశాడు.

''ప్రభూ, మంత్రిగారు ప్రతిపాదించి కొలువుకు పంపిన వాళ్లలో ఒకరు, ఆయన స్నేహితుడి కొడుకు. మరొకరు మహారాణి వారి దూరపు బంధువు,'' అన్నాడు కనక గుప్తుడు. ఆ మాటలకు రాజు చిన్నగా నవ్వి, ''ఏం, అలాంటివాళ్లు, కోశాగారంలో చిన్న ఉద్యోగాలకు కూడా అర్హులు కారనా, నీ ఉద్దేశ్యం?'' అని అడిగాడు.

''ఇది అర్హతను గురించిన సమస్య కాదు ప్రభూ! అలాంటి పలుకుబడి గల వాళ్ళ చేత, నేను ఒళ్ళు వంచి పని చేయించడం చాలా కష్టసాధ్యం. ఇది నా అనుభవం మీద గ్రహించిన సత్యం. అందుకని మరొక సామా న్యుడిని కూడా పనిలోకి తీసుకున్నాను. అవసరం అయితే వాళ్ళిద్దరి పనీ అతడి చేత చేయించవచ్చని, అలా చేశాను. అయినప్ప టికీ, మంత్రిగారు చెప్పినదానికన్న హెచ్చు వ్యయం కాకుండా తగు జాగ్రత్త పడ్డాను,'' అన్నాడు కనకగుప్తుడు.

కోశాధికారి వివరణతో సమాధానపడిన రాజు, సాలోచనగా మంత్రి కేసి చూశాడు. మంత్రి తలవంచుకుని ఊరుకున్నాడు.

ఆ తరవాత రాజు, జరగవలసిన పనుల అవసరాలు దృష్టిలో వుంచుకుని, ఎలాంటి ఆశ్రిత పక్షపాతం లేకుండా ఉద్యోగాలివ్వా లంటూ శాసనం జారీ చేశాడు.



# అంకురోద్గమ

బాల విలేకరుల ప్రోత్సాహ పథకాన్ని దేశవ్యాప్తంగా 13 రాష్ట్రాల్లో యునిసెఫ్ ఇండియా అమలుపరుస్తోంది. తమ కమ్యూనిటీకి సంబంధించిన విశిష్ట వివరాలను నమోదు చేసి నివేదించడంలో వెనుకబడిన వర్గాల పిల్లలను భాగస్వాములను చేయాలని ఈ విశిష్ట పథకం ప్రయత్నిస్తోంది. ప్రస్తుతం ఈ కార్యక్రమంలో దాదాపు 7,284 మంది పిల్లలు నిమగ్నమై ఉన్నారు. ఈ నెల మేము ఒరిస్సా రాష్ట్రంలోని కోరాపుట్ కు చెందిన బాల విలేకరుల గురించి చెప్పబోతున్నాము. దేశంలోని ఇతర ప్రాంతాలకు చెందిన బాల విలేకరుల కార్యక్రమాలను కూడా చందమామ తదుపరి సంచికలలో మీరు తెలుసుకోవచ్చు.

## సంపాదకీయం

పెద్దలకు అభినందనలు మరియు మా మిత్రులకు శుభాకాంక్షలు!

ఒక్కసారిగా మనం 2010 సంవత్సరంలోకి అడుగుపెట్టేశాము. చైల్డ్ రిపోర్టర్స్ ప్రోగ్రామ్ ఒరిస్సా, కొరాపుట్ లోని దశ్‌మంతపుర్, పొటాంగి మండలాల్లో 2005వ సంవత్సరం ప్రారంభించబడింది. 10 పాఠశాలలకు చెందిన 100 మంది పిల్లలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రతి బాలబాలికా ఈ పథకంలో పాలుపంచుకునేలా చేయాలనే మా లక్ష్యం ఫలవంతమైంది. ఇవ్వాళ ఆ ప్రాంతంలో దాదాపు రెండువేల మంది బాల రిపోర్టర్లు ఉన్నారు. ఈ పథకం అమలుకు తోడ్పడిన యునిసెఫ్, సర్వ శిక్షా అభియాన్, జిల్లా యంత్రాంగానికి మేం కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

గత కొన్ని సంవత్సరాలుగా బాల రిపోర్టర్లు పలు కార్యక్రమాలలో పాలు పంచుకున్నారు. ఈ సంవత్సరం మేము అంధులు, బధిరులు, మూగ పిల్లలపై దృష్టిపెట్టాం. తమలో మరుగున పడిన ప్రతిభా సామర్థ్యాలను వీరు ఈ సందర్భంగా చాటి చెప్పారు. అనేక విషయాలను వీరు నేర్చుకున్నారు కూడా. అంకురోద్గమ పై ఈ పిల్లల అనుభూతులు, ఉద్వేగాలు, ఆకాంక్షలను రాబోయే రోజుల్లో మేము ప్రచురించనున్నాము. ఈ సంచికలో మేము ఈ దిశగా చిన్న అడుగు వేస్తున్నాము. పిల్లల భాగస్వామ్యంపై జరిగిన వర్క్ షాపులో పాల్గొనడానికి కోరాపుట్ నుంచి ఇద్దరు బాల రిపోర్టర్లు డిల్లీకి వెళ్లారు. దాని విశేషాలను కూడా ఈ సంచికలో మీరు చూడవచ్చు.

ఈ సంచిక ఈ ఏడాది మరింతమంది పిల్లలను ప్రభావితం చేస్తుందని మేము ఆశిస్తున్నాం.

మీ,

◆ బాల రిపోర్టర్ల క్లబ్, కోరాపుట్, ఒరిస్సా.

# మన జీవిత సత్యాలు



భోలు



దీదీ



గౌరి



కన్ఛా



మిలి

1

పిల్లలు బడిలో ప్రతిరోజూ అస్వస్థతకు గురవుతున్నారు. దీనిపై పిల్లలు టీచర్‌తో మాట్లాడుతున్నారు.

గౌరి: టీచర్, ఈ సమస్యను మనం ఎలా పరిష్కరించగలం?

దీదీ: మీరంతా చేరి కలిసి కట్టుగా దీనికి ఓ పరిష్కారం చూపాలి మరి.





2

పిల్లల్లో అయోమయం.

కన్ఛా: మనం ఈ సమస్యను మనకు మనమే ఎలా పరిష్కరించుకోగలం?

మిలి: సమస్యపై చర్చించడానికి పాఠశాల కేబినెట్ సమావేశానికి పిలుపునిద్దాము.



3

పాఠశాల కేబినెట్ సమావేశం

గౌరి: మన మిత్రులలో చాలామంది అనారోగ్యానికి పరిశుభ్రతా లోపమే కారణం.

కేబినెట్ సభ్యులు, ఇతర విద్యార్థులు ప్రతిపాదించిన సూచనలను అమలు చేయాలని పాఠశాల కేబినెట్ నిర్ణయించింది.

4

మరుసటిదినం, ఉదయం ప్రార్థనా సమయం ముగిశాక, పాఠశాల కేబినెట్ ఆరోగ్య మంత్రి విద్యార్థుల చేతులను పరిశీలించింది.

గౌరి: మీ గోర్లు కత్తిరించండి; లేకుంటే మీ గోళ్లలో ఉన్న క్రిములే మీకు జబ్బులొచ్చేలా చేస్తాయి.





5

మధ్యాహ్న భోజనానికి ముందు...

కన్ఛా: దయచేసి మీ చేతులను శుభ్రపర్చుకోండి. అది మీ ఆరోగ్యాన్ని కాపాడుతుంది.

6

ఒక వారం తర్వాత...

ఒక విద్యార్థి: దీదీ, ఈ రోజు అందరూ బడికి వచ్చారు.

దీదీ: మిమ్మల్ని చూసి గర్వపడుతున్నా. మీ సమస్యను మీరే పరిష్కరించుకున్నారు. చాలా బాగా చేశారు. పిల్లల భాగస్వామ్యం సానుకూల మార్పును తీసుకువస్తుంది.



## క్విజ్

1. పిల్లల భాగస్వామ్యం అంటే అర్థం ఏమిటి?
   ఎ. ఆటాడటం, క్రీడల్లో పాలుపంచుకోవడం, దృఢంగా ఉండటం.
   బి. మానసిక, శారీరక, భావోద్వేగ పరమైన ఎదుగుదలకు దారితీసే కార్యకలాపాలలో పాల్గొనడం.
   సి. పాఠశాలలో బాగా చదువుకోవడం.
2. కార్యకలాపాలలో ప్రతి విద్యార్థి పాలు పంచుకోగలడా?
   ఎ. అవును ఇది పిల్లలందరి ప్రాథమిక హక్కు.
   బి. లేదు. బాగా చదువుకునే పిల్లలు మాత్రమే పాల్గొనగలరు.
   సి. తల్లిదండ్రులు ఇష్టపడకపోతే పిల్లలు పాలుపంచుకోలేరు.
3. పిల్లల భాగస్వామ్యంలో ఉన్న ప్రయోజనాలు ఏమిటి?
   ఎ. అది మన చదువును మెరుగుపరుస్తుంది.
   బి. మన పరిసరాల పట్ల జాగరూకతను అది పెంపొందిస్తుంది.
   సి. దీనివల్ల మనకు పెద్దగా ఒరిగేది ఏమీలేదు.
4. పిల్లల భాగస్వామ్యం సమాజాన్ని ఎలా ప్రభావితం చేస్తుంది?
   ఎ. సమాజంపై పిల్లల భాగస్వామ్యం ప్రభావంపై శాస్త్రజ్ఞులు ఇంకా పరిశోధిస్తున్నారు.
   బి. మన గ్రామం, ఇళ్లను పరిశుభ్రంగా ఉంచడంలో అది మనకు తోడ్పడుతుంది.
   సి. తమ హక్కుల గురించి ప్రజలకు జాగరూకత ఉండే ఆరోగ్యకరమైన, అభివృద్ధి చెందిన సమాజానికి అది దారితీస్తుంది.

సమాధానాలు: 1. బి 2. ఎ 3. ఎ 4. సి

ఈ కథనం మీకు నచ్చిందా? మీ అభిప్రాయం మాకు పంపండి!

CHANDAMAMA INDIA LTD.,
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

మరింత సమాచారం కోసం చూడండి : childreporter@gmail.com, www.koraputonline.com



# దయ్యం కోరిక



సిరిచక్రపురంలో అవధాని అనే వ్యక్తి నివసించే వాడు. ఆ ఊళ్లో రోగాల బారిన పడిన వారికి వైద్యం చేస్తూ ప్రాణాలు కాపాడుతుండేవాడు. వ్యాధులను ఖచ్చితంగా అంచనా వేసి స్వల్ప కాలంలోనే నయం చేస్తుండటంతో చుట్టు పక్కల జనం తన హస్తవాసిపై నమ్మకం ఉంచే వారు.

మరోవైపు తాను ఆర్థిక ఇబ్బందుల పాల వుతున్నప్పటికీ, ఆకలిగొన్న వారికి కడుపు నిండా భోజనం పెట్టించేవాడు. దీంతో, ఊళ్లో అందరూ అవధానిని అభిమానించేవారు.

ఓ పర్యాయం పొరుగు ఊరిలో ఉంటున్న ఆప్తమిత్రుడి తల్లి కన్ను మూసిన సంగతి తెలిసి పలుకరించడానికి బయలుదేరి వెళ్లాడు. పరామర్శల తర్వాత మిత్రుడు అవధానితో ముచ్చటిస్తూ, తమ ఊరు జమీందారు రత్నాకరుడు చాలాకాలంగా అనారోగ్యంతో మంచం పట్టాడని, వైద్యులు ప్రయత్నించి కూడా నయం కాక దేవుడి మీద భారం వేశా రని చెప్పాడు. అవధాని విని, ''జమీందారుని ఒక సారి చూడనివ్వు'' అన్నాడు. ఇద్దరూ బయలుదేరి జమీందారు భవంతికి చేరు కున్నారు.

అవధాని వివరాలు అడిగి తెలుసుకుని ''నా ప్రయత్నం నేను చేస్తాను. ఇది భయపడ వలసిన రోగం కాదు'' అన్నాడు. రోజులు లెక్కపెడుతున్న జమీందారుకు అవధాని మాటలతో వెయ్యి ఏనుగుల బలం వచ్చిన ట్లయి చేతులు జోడించాడు.

జమీందారు రోగ నివారణకు కావలసిన వనమూలికల కోసం అవధాని సమీపంలోనే ఉన్న పొదల వద్దకెళ్లి, కావలసిన ఆకులు, బెరడులు సంపాదించి, స్నేహితుని ఇల్లు చేరాడు. పసరులు, ఆకులు నూరిన చూర్ణం తీసుకుని జమీందారు వద్దకు వెళ్లి చికిత్స ప్రారంభించాడు.

ఆరుపల్లి గోవిందరాజులు

అవధాని వైద్యం జమీందారుకు బాగా ఉపశమనం కలిగించింది. వారం దినాల్లో సంపూర్ణ ఆరోగ్యవంతుడై మంచానికి దూర మయ్యాడు. తన ఆరోగ్యాన్ని కాపాడిన అవ ధానికి జమీందారు కృతజ్ఞతలు తెలుపడమే గాక, ఊరికి సమీపంలో ఉన్న రెండు ఎకరాల భూమిని అవధాని పేర రాయించాడు.

అవధాని ఇల్లు చేరి భార్యకు విషయం చెప్పాడు. ఆమె విని ఉప్పొంగిపోయి, ''ఆ భూమిలో కూరగాయలు, పూలచెట్లు వేస్తే లాభకరంగా ఉంటుంది'' అన్నది. భార్య సలహా సబబుగా తోచడంతో అవధాని మర్నాడే భూమిని సాగు చేయడానికి బయలు దేరాడు.

పొలానికి చేరిన అవధానికి అక్కడ గుబు రుగా ఉన్న జువ్విచెట్టు కనబడింది. ఆ చెట్టు మీద ఒక దెయ్యం నివాసం ఉంటుంది. దానికి చాలా కాలంనుండి నరమాంసం తినాలని కోరికగా ఉండేది. అటువైపుగా జనసంచారం లేకపోవడం వల్ల దాని కోరిక కోరిక గానే మిగిలి పోయింది. అవధానిని చూసిన దయ్యం ఒక్క సారిగా ఉలిక్కిపడి ఆహా ఏమి నాభాగ్యం అనుకుని లొట్టలేసుకుంటూ ''ఆగు'' అని బిగ్గరగా అరిచింది. అవధాని ఒక్కసారిగా భయకంపితుడై ఆ వెంటనే ధైర్యం తెచ్చుకుని తలెత్తి నిదానించాడు. జడలు విరబూసు కున్న దయ్యం భయంకరంగా కనిపించింది.

''ఏయ్.. ఈ దినంతో నీకు భూమ్మీద నూకలు చెల్లిపోయాయి!'' అంది.

''ఏం ఫర్వాలేదు!'' అని నిర్లిప్తంగానే జవాబిచ్చాడు.



''నిన్ను చంపి భక్షిస్తాను రోయ్!'' మళ్లీ అన్నది.

అవధాని ''మట్టిలో బూడిద కావలసిన ఈ శరీరం మూడునాళ్ల ముచ్చట కోసమే గదా! అటువంటప్పుడు నా శరీరం నీ ఆకలిని తీరు స్తుందంటే నువ్వు నిర్భయంగా చంపి భక్షిం చవచ్చును!'' అన్నాడు.

దయ్యం ఒక్కసారిగా ఖంగుతిన్నది. దాని జీవితకాలంలో తనను చూస్తే ఆమడ దూరం పారిపోయిన వారినే అది చూసింది తప్ప ఇలాంటి వైరాగ్యం ప్రదర్శించిన వారిని ఎన్నడూ చూడలేదు. అదే సమయంలో మనుష్యులెవరో రావడం కంటపడి నిదానించి పరిశీలించింది.

దగ్గరికి చేరిన ఒక వ్యక్తి అవధానిని చూసి నమస్కరించి ''అయ్యా, నా ఏకైక ముద్దుల కుమార్తె మూడు దినాలనుండి తీవ్రమైన జ్వరంతో మూసిన కన్ను తెరవడం లేదు! మీరే

కాపాడాలి'' అని అర్థించాడు. అవధాని ఆ వ్యక్తికి ధైర్యం చెప్పి, మొలనుండి ఏవో గుళికల పొట్లాలు తీసి మూడు పూటలూ తినిపించ మన్నాడు.

తర్వాత మరో యువకుడు ముందుకు వచ్చి ''అనాథనైన నన్ను చేరదీసి ఓ ఇంటి వాడిని చేశారు. మీమేలు మర్చిపోలేను'' అంటూ పట్టువస్త్రాలు సమర్పించి అవధానికి పాదాభివందనం చేసి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

ఆ తర్వాత పక్కనే ఉన్న ఓ అవ్వ రెండు చేతుల్లో ఉన్న పురిటి పసికందుని చూపించి ''అయ్యా, ఈ పసికందుకు జన్మనిచ్చి నా కూతురు కన్ను మూసి రెండు దినాలైంది. పాలచుక్కకు కరువై ఈ పసిప్రాణం తల్లడిల్లి పోతోంది. మీరే కాపాడాలి.'' అని దీనంగా వేడుకున్నది.

అవధాని ఆమెతో, ''దిగులు పడవద్దు. నా ఇంట పాడి ఆవు ఉన్నది. పాల చుక్కకు కొరత ఉండదు. ఈ పసికందుతో బాటు నువ్వు కూడా నా ఇంటికి వచ్చి కాలం చెందినంత వరకు రోజులు వెళ్లబుచ్చవచ్చు'' అన్నాడు.

వాళ్లు వెళ్లిపోయాక దయ్యం అవధానిని సమీపించింది. ''మహాత్మా! అనేక బాధలు అనుభవిస్తూ కూడా అనుక్షణం పరోపకారం చేసే నీలాంటి వ్యక్తి ఉత్తముడు. నీ సేవ చేసుకుంటే నా ఈ పాపపు జన్మ ధన్యమవుతుంది. ఏ పూర్వ జన్మ ఫలితంగానోనేను ఈ జన్మలో నరకం అనుభవిస్తున్నాను. వచ్చే జన్మలోనైనా కనీసం మీవలె మానవజన్మ ఎత్తి ఆపదల్లో, కష్టాల్లో ఉన్నవారికి పరోపకారం చేసేలా ఆశీర్వదించండి స్వామీ!'' అని వేడుకుంది.

దయ్యం కోరిక విన్న అవధాని ఆశ్చర్య పోయి ఒక్క క్షణం ఆలోచించి ''పరులకు సహాయం చేయాలంటే, మరో జన్మకు వాయిదా వేసుకోవలసిన పని లేదు. ఇప్పుడే నువ్వు నీ క్రూరస్వభావాన్ని మానుకుని కష్టంలో ఉన్న వారికి నీవు చేయగలిగిన సహాయం చేయి చాలు. అదే పునర్జన్మతో సమానం'' అని తన దారిన పోయాడు.

ఆ తరవాత, చుట్టుపక్కల గ్రామాలవారికి జువ్వి చెట్టు మీద దయ్యం కనిపించకుండా పోయింది.





రాహుల్, రాణి ఏం ఆట ఆడుదామా అని ఆలోచిస్తు న్నారు. ''డాక్టర్ ఆట ఆడుకుందామా?'' అని అడిగాడు రాహుల్. ''చాలా బావుంటుంది. నువ్వు ఆపరేషన్ చెయ్. నేను కేసు పెడతాను,'' అన్నది రాణి.

---

టీచర్: కరణ్, నువ్వెందుకు హోమ్‌వర్క్ చెయ్యలేదు?
కరణ్: క్షమించండి టీచర్.
టీచర్: 'క్షమించండి' అనే మాట నా డిక్షనరీలో లేదు.
కరణ్: లైబ్రరీలోని డిక్షనరీలో తప్పకుండా ఉంటుంది టీచర్.



## చందమామ లోకజ్ఞానం క్విజ్-15 ఏప్రిల్ 2010 సమాధానాలు

1. గాంధర్వం 2. హిందూస్తానీ మరియు కర్నాటిక్ 3. ఒడిస్సీ 4. పురందరదాసు 5. కాశ్మీర్ 6. తబలా 7. సితార్


Statement about Ownership of
**CHANDAMAMA (Telugu)**
Rule 8 (Form VI), Newspaper (Central) Rules, 1956

1. **Place of Publication:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
2. **Periodicity of Publication:**
MONTHLY
1st of each calendar month
3. **Printer's Name:**
Prashant Mulekar
**Nationality :**
Indian
**Address:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
4. **Publisher Name :**
Prashant Mulekar
**Nationality:**
Indian
**Address:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
5. **Editor's Name :**
Prashant Mulekar
**Nationality :**
Indian
**Address :**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
6. **Name and address of Individuals who own the newspaper :**
Chandamama India Ltd.,
Board of Directors:
1. Prashant Mulekar
2. Kiran Kulkarni
3. Salim Govani
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

I **Prashant Mulekar**, do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd,) **Prashant Mulekar**
Publisher

1st March 2010



# పతనం



ఆరావళి పర్వత ప్రాంతంలో, కృష్ణచంద్రుడనే పండితుడు గురుకులం ఒకటి నడుపుతూ ఉండేవాడు. ఆయన చక్కని బోధకుడుగా దేశవ్యాప్తంగా పేరు గాంచాడు. పైగా చాలా ఉదార హృదయుడు. ఆయన దగ్గిర శిష్య రికం చెయ్యడానికి, ఇరుగు పొరుగు దేశాల నుంచి కూడా ఎంతో మంది విద్యార్థులు గురుకులానికి వస్తూండేవారు.

ఒకనాటి సాయంకాలం గురుకులంలోని చెట్లవద్ద, ఏదో కలకలం వినిపించి, కృష్ణ చంద్రుడు అటు వెళ్లి చూశాడు. అక్కడ ఒక విద్యార్థిని, మరొక నలుగురు విద్యార్థులు దండిస్తున్నారు. వాళ్లను సంగతేమిటని అడి గాడు కృష్ణచంద్రుడు.

అప్పుడొక విద్యార్థి ముందుకు వచ్చి, ''మేము దాచుకుంటున్న మామిడి పళ్లను ఇతడు రోజూ దొంగతనంగా తింటున్నాడు. స్వామీ! అడిగి తీసుకోమని చెప్పాము. అయినా వినలేదు. ఇంకా చిన్న చిన్న దొంగ తనాలు కూడా చేస్తూంటాడు,'' అన్నాడు. కృష్ణచంద్రుడు దోషి అయిన విద్యార్థి కేసి చూశాడు. వాడు తల వంచుకుని నేల చూపులు చూస్తున్నాడు. ఆయన అక్కడి నుంచి వెనుదిరుగుతూ, శిష్యులందర్నీ తన వెంట రమ్మన్నాడు. అందరూ వచ్చి పాఠ శాలలో కూర్చున్న తరవాత, కృష్ణ చంద్రుడు ఇలా చెప్పసాగాడు:

''ప్రకృతిలో అతి చంచలమైనది నీరు. ఏమాత్రం సందు దొరికినా, అథోముఖంగా పయనించడానికే ప్రయత్నిస్తుంది. సరిగ్గా పతనం కూడా నీటిలాంటిదే. మనిషి మనసు ఏమాత్రం బలహీనమైనా, అది తప్పకుండా పతనం వైపుకే మొగ్గుతుంది.

ఒకసారి అలా ప్రారంభమైన పతనం, సర్వ నాశనానికి దారితీయడానికి ఎంతో సమయం పట్టదు. ఇందుకు చక్కటి ఉదాహరణగా, మీకు శ్యామలుడనే కుర్రవాడి వృత్తాంతం చెబుతాను వినండి.

**25 ఏళ్ళనాటి చందమామ కథ**



శ్యామలుడు స్వతహాగా తెలివైనవాడు. కాని, చెడు సావాసాల వల్ల ఎందుకూ పనికి రానివాడుగా తయారయ్యాడు. తల్లిదండ్రులూ, ఇతర పెద్దలూ చేసే సద్బోధలు వాడి చెవులకు కంటకంగా ఉండేవి. చదువు మానివేసి, స్నేహితులతో కలిసి చెడుతిరుగుళ్లు తిరుగుతుండేవాడు. నెమ్మదిగా వాడికి చిల్లర దొంగతనాలు కూడా అలవాటయినై.

శ్యామలుడు ఉంటున్న దేశపురాజు గొప్ప దేవీభక్తుడు. ఆయన చాలా ధనవ్యయం చేసి ఒక దేవీ ఆలయం కట్టించాడు. ఆలయం పాలరాతితో కట్టబడింది.

దేవీ విగ్రహానికి అనేక బంగారు ఆభరణాలు చేయించాడు. వాటి అన్నింటిలోకీ విలువైనది, ఒక నవరత్నహారం. దానికి మధ్యలో ఒక అమూల్యమైన వజ్రం అమర్చబడింది. అది కోట్ల విలువ చెయ్యడమే కాక, అది ఉన్న చోట సకల శుభాలూ కలుగుతాయని చెప్పుకునేవారు.

ఆ దేవికి ప్రతి సంవత్సరం తొమ్మిది రోజుల పాటు, అతివైభవంగా ఉత్సవాలు జరుగుతూండేవి. ఆ ఉత్సవాలకు దేశవిదేశాల నుంచి ప్రజలూ, రాజులూ, ముఖ్యాధికారులూ వచ్చేవారు. ఒకసారి అలా ఆ ఉత్సవాలకు వచ్చిన పరరాజు కాలనాథుడికి, దేవి మెడలో కాంతులు విరజిమ్ముతున్న నవరత్నహారం కంటబడి, మతిపోయినంత పనయింది. ఆ హారంలోని వజ్రం విలువ కూడా అతడికి తెలియవచ్చింది.

ఉత్సవాలు ముగియగానే, కాలనాథుడు తన దేశం తిరిగివెళ్లాడు. కొద్ది రోజుల తరవాత, ఆ హారాన్ని అపహరించి తెమ్మని, తన ముఖ్య చారుల్లో ఒకణ్ణి పంపాడు. కాలనాథుడు ఆశ చూపిన బహుమతికి లొంగిపోయిన ఆ చారుడు, దేవీ ఆలయానికి వచ్చి పూజారిని కలుసుకున్నాడు. చారుడు ఎరచూపిన ధనానికి పూజారి కూడా లొంగిపోయాడు.

ఇద్దరూ కలిసి మర్నాటి రాత్రి హారాన్ని అపహరించడానికి నిశ్చయించుకున్నారు. సరిగ్గా అదే రాత్రి, శ్యామలుడు చాలాసేపు స్నేహితులతో తిరిగి ఇంటికి వస్తూ, దాహం తీర్చుకోవడానికి ఆలయం దగ్గిర ఉన్న కోనేటి దగ్గిర ఆగాడు.

ఆ సమయంలో, దూరంగా పూజారీ, చారుడూ వస్తూ వాడికి కనిపించారు. అంత అర్ధరాత్రివేళ పూజారి ఆలయానికి ఎందుకు వస్తున్నాడో, శ్యామలుడికి అర్థం కాలేదు. పూజారిని గురించి ఏదో అనుమానం కలిగి, వాడు చప్పున ఆలయంలోకి వెళ్లి, గర్భగుడి



ఇందుకు పూజారి సంతోషంగా ఒప్పుకు న్నాడు. వెంటనే ఇద్దరూ హారం తీసుకుని, గర్భగుడికి జాగ్రత్తగా తాళం వేసి, నిశ్శబ్దంగా బయటకు వచ్చి, అక్కడ కాపలా కాస్తున్న చారుడి తలపై బలంగా మోదారు.

ఆ దెబ్బతో వాడు నోటిమాట కూడా లేకుండా అక్కడే కుప్పకూలిపోగానే, తాళపు చెవులను వాడి పక్కన పడవేసి, పూజారీ, శ్యామలుడూ ఊరి పొలిమేర కేసి వేగంగా బయలు దేరారు.

ఊరి పొలిమేర దాటగానే, ఇద్దరి మనసు ల్లోనూ, ఆ హారాన్ని తమ సొంతం చేసుకోవా లనే ఆలోచన కలిగింది. మర్నాటి మధ్యాహ్నా నికి వాళ్లిద్దరూ ఒక అడవి చేరుకుని, తాము దారిలో సత్రం నుంచి అడిగి తెచ్చుకున్న భోజనాలు చేశారు.

పక్కన చీకట్లో నక్కాడు. కొద్దిసేపు తర్వాత పూజారి ఒక్కడూ అక్కడకి వచ్చి, గర్భగుడి తాళం తీసి లోపలికి వెళ్లాడు.

కొద్దిసేపు ఆగి శ్యామలుడు కూడా గర్భ గుడిలోకివెళ్లి, పూజారి వెనకగా నిలబడి, ''ఏం చేస్తున్నావు, పూజారీ?'' అన్నాడు.

ఊహించని ఈ సంఘటనకు పూజారి బిత్తరపోయాడు. భయంతో వణుకుతున్న అతడి చేతుల్లోంచి హారం కింద పడింది.

శ్యామలుడు హారం తీస్తూ, ''భయప డకు! హారం అమ్మేయాలని చూస్తున్నావా? నీ వెంట వచ్చిన అతనెవరు?'' అని అడిగాడు.

పూజారి నెమ్మదిగా తేరుకుని వివరాలు చెప్పాడు. శ్యామలుడు హారాన్ని పరీక్షగా చూస్తూ, ''ఎవరో పరదేశస్థుడికి దీన్ని అప్ప జెప్పి, కాస్త ధనం పుచ్చుకునే బదులు మనమే దీన్ని ఉపయోగించుకుంటే బావుంటుంది గదా!'' అన్నాడు.

అయితే, ''ఒకరికి తెలియకుండా ఒకరు భోజనాల్లో విషం కలపడం వల్ల ఇద్దరూ మరణించారు,'' అని కథ పూర్తి చేశాడు కృష్ణ చంద్రుడు.

తరవాత ఆయన శిష్యులతో, ''శ్యామ లుడూ, పూజారీ ఇద్దరూ మొదట్లో అంత ప్రమాదకారులైన వ్యక్తులు కారు. అయితే వారిలో అణుమాత్రంగా ప్రారంభమైనపతనం, రెండు రోజుల్లో సర్వనాశనానికి దారి తీసింది!'' అన్నాడు.

శిష్యులంతా వెళ్లిపోయాక, కృష్ణచంద్రుడు వెనుదిరిగే సరికి, ఆయన భార్య కన్నీళ్లు తుడుచుకుంటూ, ''ఆ విద్యార్థి బాగుపడి నట్లే! కానీ పాపం శ్యామలుడూ, పూజారీ దురదృష్టవంతులు.'' అన్నది.

కృష్ణచంద్రుడు నవ్వి, ''పూజారి దుర దృష్టవంతుడే కాని, శ్యామలుడు మాత్రం కాదు,'' అన్నాడు

''అదేమిటి?'' అన్నది భార్య ఆశ్చర్య పోతూ.

''శ్యామలుడు వెంటనే చనిపోలేదు. వార్ధక్యంలో విషప్రయోగం వల్ల ముందుగా పూజారి చనిపోయాడు. ఆ తర్వాత శ్యామ లుడు చావు బతుకుల మధ్య అక్కడే పడి కొట్టుకుంటుండగా, ఆయుర్వేదంలో నిధి, మహామంత్రవేత్త అయిన ఒక ధర్మాత్ముడు అత డిని రక్షించాడు. అతడి కథ అంతా వినికూడా అతడిని అసహ్యించుకోకుండా ఆదరించి జ్ఞానభిక్ష పెట్టాడు,'' అన్నాడు కృష్ణచం ద్రుడు.

''ఒక రోజు తేడాలో శ్యామలుడు రెండు చావులకు కారకుడయ్యాడు. ఆ పాపాలకు ఏదో కొంత ప్రాయశ్చిత్తం జరిగి ఉంటే ధర్మం అనిపించుకునేది కాబోలు.'' అన్నది కృష్ణ చంద్రుడి భార్య.

అందుకు కృష్ణచంద్రుడు, ''అలాంటి ప్రాయశ్చిత్తం జరగకపోలేదు. ఆయన శ్యామ లుడిని శిష్యుడిగా స్వీకరించినా, ఒక సంవ త్సరం పాటు అతడికి గురుకులంలో నివా సార్హత కలిగించలేదు.

హత్యాయత్నానికి ఒడిగట్టిన శ్యామలుడు గురుకులానికి దాపుల ఉన్న ఒక చీకటి కొండ గుహలో సంవత్సరం కాలం గడపవలసి వచ్చింది. ఏమైతేనేం, స్వతహాగా తెలివిమం తుడైన అతడు, ఆ మహాత్ముడి వద్ద జ్ఞానార్జన చేసి, కృష్ణచంద్రుడయ్యాడు,'' అన్నాడు.

''అంటే శ్యామలుడు, మీరా?'' అంటూ నివ్వెరపోయిన కృష్ణచంద్రుడి భార్య, ''మరి ఆ నవరత్న హారం ఏమయింది?'' అని అడి గింది.

''అది వెంటనే రాజుగారికి చేర్చబడింది. మా గురువు అనుగ్రహం కారణంగా నేను ఎలాంటి శిక్షకు గురి కాలేదు. నీటివలె అధో ముఖంగా పయనించే నన్ను, ఊర్ధ్వాభి ముఖంగా కీర్తిశిఖరాన్ని అందుకునేలా చేసి, ఆ మహాత్ముడు నాకు పునర్జన్మ ప్రసా దించాడు. తీవ్రమైన విపత్కర పరిస్థితులలో ఆయన శిష్యరికం లభించడం, నా భాగ్యం!'' అన్నాడు కృష్ణచంద్రుడు. – శివ





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | My uncle is coming on Sunday. | I want to talk to you. |
|---|---|---|
| Telugu | మా మామయ్య ఆదివారం వస్తున్నారు. | నేను మీతో మాట్లాడాలనుకుంటున్నాను. |
| Hindi | मेरे चाचा रविवार को आ रहे हैं।<br>మేరే చాచా రవివార్ కో అ రహే హై. | मैं आपसे बात करना चाहता हूँ।<br>మైన్ ఆప్సే బాత్ కరనా చాహ్తా హూ. |
| Tamil | ஞாயிறன்று என் மாமா வருகிறார்.<br>జ్ఞాయిరంద్రు ఎన్ మామా వరుగిరార్. | உன்னிடம் நான் பேச வேண்டும்.<br>ఉన్నిడమ్ నాన్ పేస వేండుమ్. |
| Bengali | আমার কাকা রবিবার আসছেন<br>అమార్ కాకా రబిబార్ అసచెన్. | আমি তোমার সঙ্গে কথা বলতে চাই<br>అమి తొమార్ సంగె కథా బలతీ చాయి. |
| Marathi | माझे काका रविवारी येत आहेत.<br>మాజె కాకా రవివారీ యేత్ ఆహెత్. | मला तुमच्याशी काही बोलायच आहे.<br>మలా తుమ్‌చ్యాశీ కాహీ బోలాయచ ఆహె. |
| Kannada | ನನ್ನ ಮಾವ ಭಾನುವಾರ ಬರುತ್ತಿದ್ದಾರೆ.<br>నన్న మావ భానువార బరుత్తిద్దారె. | ನಿಮ್ಮೊಂದಿಗೆ ನಾನು ಮಾತನಾಡಲು ಇಚ್ಛಿಸುತ್ತೇನೆ.<br>నిమ్మొందిగె నాను మాతనాడలు ఇచ్ఛిసుత్తేనె. |
| Oriya | ମୋର ମାମୁ ରବିବାର ଦିନ ଆସୁଛନ୍ତି ।<br>మొర మమ్ము రబిబార దిన అసుచ్చంటి. | ମୁଁ ତୁମ ସହିତ କଥାବାର୍ତ୍ତା କରିବାକୁ ଚାହୁଁଛି ।<br>ముని తుమ సహిత కథాబార్తా కరిబాకు. |
| Gujarati | મારા કાકા રવિવારે આવી રહ્યા છે.<br>మారా కాకా రవివారె ఆవీ రహ్యా ఛె. | મારે તમારી સાથે વાત કરવી છે.<br>మారె తమారీ సాథె వాత్ కరవీ ఛె. |
| Assamese | মোৰ মামা দেওবাৰে আহিব।<br>మోర్ మామా డెయోబారె అహిబ. | মই আপোনাৰ লগত কথা পাতিব বিচাৰিছো।<br>మయి ఆపొనార్ లగట కథా పాటిబ బిసరిసొ. |
| Malayalam | എന്റെ അങ്കിൾ ഞായറാഴ്ച വരുന്നുണ്ട്.<br>ఎంటె అంకుల్ న్యాయరఝ్చ వరున్నుండు. | എനിക്ക് നിന്നോട് സംസാരിക്കണം.<br>ఎనిక్కు నిన్నోడు సంసారిక్కనమ్. |
| Santali | ᱤᱧ ᱢᱟᱢᱚ ᱥᱤᱧᱜᱮ ᱢᱟᱦᱟᱸ ᱦᱤᱞᱚᱜ ᱟ ᱦᱤᱡᱩᱜ ᱠᱟᱱᱟ᱾<br>ఇంఙ్ మామో సింగె మాహా హిలోగ్ అ హిజుగ్ కానా. | ᱟᱢ ᱥᱚᱱ ᱨᱚᱯᱚᱲ ᱥᱟᱱᱟᱹᱧ ᱠᱟᱱᱟ᱾<br>అమ్ సొన్ రపడ్ సానాఙ్ కానా. |
| Sanskrit | मम पितृव्य: रविवासरे आगमिष्यति।<br>మమ పిత్రవ్యః రవివాసరె ఆగమిష్యతి. | अहम् तुभ्यम् वार्ता कर्तुम् इच्छामि।<br>అహమ్ తుభ్యమ్ వార్తా కర్తుమ్ ఇచ్ఛామి. |





| English | I am writing a letter. | I love to sing. |
| --- | --- | --- |
| Telugu | నేను ఉత్తరం రాస్తున్నాను. | నాకు పాడటం అంటే ఇష్టం. |
| Hindi | मैं एक पत्र लिख रहा हूँ।<br>మైన్ ఏక్ పత్ర లిఖ్ రహా హూన్. | मुझे गाना पसन्द है।<br>ముఝే గానా పసంద్ హై. |
| Tamil | நான் கடிதம் எழுதுகிறேன்.<br>నాన్ కడితమ్ ఎళుతుగిరేన్. | எனக்கு பாடுவது பிடிக்கும்.<br>ఎనక్కు పాడువదు పిడిక్కుమ్. |
| Bengali | আমি একটা চিঠি লিখছি<br>అమి ఎకతే చిఠి లిఖ్‌చి. | আমি গান গাইতে ভালোবাসি<br>ఆమి గాన గాయితె భలొబాషి. |
| Marathi | मी पत्र लिहित आहे.<br>మీ పత్ర లిహిత్ ఆహె. | मला गाण्याची आवड आहे<br>మలా గాన్యాచీ ఆవడ ఆహె. |
| Kannada | ನಾನು ಪತ್ರವೊಂದನ್ನು ಬರೆಯುತ್ತಿದ್ದೇನೆ.<br>నాను పత్రవొందన్ను బరెయుత్తిద్దేనె. | ಹಾಡುವುದೆಂದರೆ ನನಗೆ ಇಷ್ಟ.<br>హాడువుదెందరె ననగె ఇష్ట. |
| Oriya | ମୁଁ ଗୋଟେ ଚିଠି ଲେଖୁଛି ।<br>మున్ గోటై చిత్తి లెఖుచ్చి. | ମୁଁ ଗାଇବାକୁ ଭଲ ପାଏ ।<br>మున్ గాయిబకు భలపాయె. |
| Gujarati | હું પત્ર લખી રહ્યો/રહી છું.<br>హు పత్ర లఖీ రహ్యో/రహీ ఛు. | મને ગાવાનો શોખ છે.<br>మనె గావానో శోఖ్ ఛె. |
| Assamese | মই এখন চিঠি লিখি আছো।<br>మయి ఎఖన్ చిఠి లిఖి ఆసొ. | মই গান গাই ভাল পাও।<br>మయి గాన్ గాయి బాల్ పావ్. |
| Malayalam | ഞാനൊരു കത്ത് എഴുതുകയാണ്.<br>న్గానొరు కథు ఎళుథుకయాను. | എനിക്ക് പാടാൻ ഇഷ്ടമാണ്.<br>ఎనిత్తు పాడను ఇష్టమ్మను. |
| Santali | ᱤᱧ ᱢᱤᱫ ᱪᱤᱴᱷᱤᱧ ᱚᱞ ᱮᱫᱟ।<br>ఇన్జి మిడ్ చిథింజ్ ఒల్ ఎడా. | ᱥᱮᱨᱮᱧ ᱫᱩᱧ ᱠᱩᱥᱤᱭᱟᱜ-ᱟ।<br>సెరెంజ్ దున్జి కుసియాగ్-అ |
| Sanskrit | अहम् एकम् पत्रम् लिखामि।<br>అహమ్ ఎకమ్ పత్రమ్ లిఖామి. | गानम् मह्यम् रोचते।<br>గానమ్ మహ్యమ్ రొచతె. |

## వేగసూత్రం ఫలితాలు

ఏప్రిల్ 2010 సంచిక వేగసూత్రంకు మీరు పంపించిన సమాధానాలకు కృతజ్ఞతలు. సరైన సమాధానాలు రానందున, బహుమతి ప్రకటించడం లేదు.

# భారత దర్శిని

## భక్తి బ్యాంకు



వారణాసిలో ఒక బ్యాంకు నగదుకు బదులుగా భక్తిని స్వీకరిస్తున్న విషయం మీరు ఎప్పుడయినా విన్నారా? ఓం నమశ్శివాయ అనే పేరుగల ఈ బ్యాంకును 2002లో స్థాపించారు. సంవత్సరానికి ఒక రోజు మహాశివరాత్రి నాడు మాత్రమే ఈ బ్యాంకు తెరుచుకుంటుంది. ఓం నమశ్శివాయ అని రాసి ఉన్న రాతప్రతులను స్వీకరిస్తుంది.

భారతీయులు, ప్రవాసభారతీయుల నుంచి ఈ బ్యాంకు ఇంతవరకు చేతితో రాసిన 54 కోట్ల ఓం నమశ్శివాయ మంత్రాల డిపాజిట్లను స్వీకరించింది. అలా మంత్రాల డిపాజిట్ ద్వారా తమకు శివకృప లభిస్తుందని భక్తుల నమ్మిక. ఎంత ఎక్కువగా డిపాజిట్ చేస్తే అంతఎక్కువ కృప అన్నమాట.

## కడుపునొప్పికి వంకాయ వైద్యం

మీరు దీన్ని నమ్మగలరా? మీరు చాలాకాలంగా కడుపు నొప్పితో బాధపడుతున్నట్లయితే త్రిచూర్‌కు 25 కి.మీ దూరంలో ఇరింజలక్కుడ ప్రాంతంలోని భరత దేవాలయాన్ని సందర్శించండి. ఇది రాముడి సోదరుడైన భరతుడి కోసం నిర్మించిన ఏకైక ఆలయం. సంగమేశ్వర అని పిలిచే ఇక్కడి దేవుడికి వంకాయలు సమర్పించడం ద్వారా కడుపు నొప్పిని తగ్గించుకోగలరని భక్తుల విశ్వాసం.

ఈ నమ్మకం వెనుక ఓ కథ ఉంది. పూర్వం ఈ ఆలయ భక్తుడు ఒకరికి తీవ్రమైన కడుపు నొప్పి వచ్చిందట. దేవుడు అతడికి కలలో కనిపించి తనకు 101 వంకాయలు నైవేద్యంగా పెట్టమని చెప్పాడట. అలా చేసిన భక్తుడికి చిత్రంగా నొప్పి తగ్గిపోయిందట. అప్పటినుంచి ప్రజలు తన కడుపు నొప్పిని పోగొట్టుకోవడానికి దేవుడికి వంకాయల నైవేద్యం పెడుతున్నారు.





**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



**Chandamama!**

Because stories make the world go round...

**Choose your Chandamama! Go to www.chandamama.com & subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..........................................................................................

Date of Birth: ................................ Sex :....................................

Address: ......................................................................................

..................................................................................................

..................................................................................................

...................................................... City: ......................................

State:......................................... Pin:...............................................

Telephone:....................................................................................

Mobile:.........................................................................................

Email:...........................................................................................

Subscription Number. (for renewals):..........................................

Gift Subscription to the following address:

..................................................................................................

..................................................................................................

..................................................................................................

..................................................................................................

Enclosed Cheque/DD* for Rupees................................................

Cheque/DD No ............................................................................

favouring Chandamama India Ltd on..........................................

..........................................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East),
Mumbai-400093. Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

## Get surprise gifts by subscribing this month **

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.





# యుద్ధ విరామం

క్రీ.పూ 989, సప్తసింధవా, సరస్వతీ నది వెలుపలి గట్టు.

పురుకుత్సుడు తన శిరస్త్రాణం తీసివేశాడు. ఎండ మండుతోంది; భారత పుత్రుల మధ్య జరిగిన రక్తపాతం ప్రభావ ఫలితంగా ఈ సంవత్సరం వర్షాలు పడవని పండితులు ఇప్పటికే తేల్చి చెప్పారు.

త్రిక్షులు, పురు వంశీయులు సంవత్సరాలుగా యుద్ధంలో మునిగి ఉన్నారు. ఈ యుద్ధం ఫలితంగా వారికి తమ గడ్డపై స్థిరమైన ఆధిపత్యం లేకుండా పోయింది.



వాస్తవం ఇదేనా? పురుకుత్సుడి ఆత్మ అతడిని నిలదీసింది.

కారణమేమిటో అతడికి బాగా తెలుసు. దాశరాజ్ఞులు.

పది తెగలు, పది మంది రాజులు.. భరత ఖండంలోని మొత్తం జనాభా అంతా కలిసి ఒకరికి వ్యతిరేకంగా జట్టు కట్టింది. ఒక పండితుడు ప్రతీకార చర్య చేపట్టడమే ఇందుకు కారణం. వీరందరూ పురు నేతృత్వంలో ఒకే పతాకం కింద ఏకమై త్రిక్షులతో పోరుకోసం ముందుకు సాగారు.

ఆ యుద్ధం భయంకరమైన రక్తపాతానికి దారి తీసింది.

అతడు తన తల పంకించాడు. సుదాసురాజు గురించీ, మరణాల గురించీ ఆలోచించవద్దు. త్రసదాస్యుడి గురించి అసలే ఆలోచించవద్దు.

''కుమారా!'' అతడు బాధతో గొణిగాడు. పది తెగల యుద్ధంలో అతడి కుమారుడు బందీగా పట్టుబడ్డాడు. ఇక్కడ తాను సర్వనాశనానికి దగ్గిరలో ఉన్నాడు. అతడు ప్రస్తుతం నది అంచున ఓ చిన్న గ్రామంలో ఉన్నాడు. అది తటస్థ ప్రాంతం అతడి సొంత నగరాలు చాలా దూరంలో ఉన్నాయి. అతడి సైన్యంలో చాలా భాగం తిరిగి రాలేదు. సర్వనాశనం నుంచి తప్పించుకోవడానికి ఇప్పుడు తనకు ఏదారీ లేదు.

అయితే అంతిమ వినాశనానికి ముందు త్రసదాస్యుపై ఎదురుదాడి ప్రారంభించడానికి అతడికి చాలామంది సైనికులు అవసరం.

దానికోసం అతడికి తప్పనిసరిగా కొన్ని వస తులు కావాలి.

ఎవరో అతడి వైపుగా వచ్చారు. భారీ గడ్డం కలిగిన వ్యక్తి. చేతిలో కర్ర. పురుకుత్సుడు వేచి ఉన్నాడు.

''మీకు శుభాకాంక్షలు,'' అంటూ అతడు పురుకుత్సుడిని పలకరించాడు. అతడి కళ్లలో అలసట కనిపిస్తోంది. రాజుసైతం తన అలసట దాచుకోలేకపోయాడ.

''శుభాకాంక్షలు,'' మర్యాద ఉట్టిపడుతున్న స్వరంతో అన్నాడతడు.

''నన్ను చందనుడు అంటారు. మరి మీరెవరు?'' అడిగాడు.

'నేను పురుకుత్సుడిని'' అంత స్పష్టంగా తెలీడంలేదు కాని, తన ఎదురుగా ఉన్న వ్యక్తి బిర్రబిగుదీసుకుపోయినట్లు కనిపిస్తోంది. ఇక్కడ తెలిసినవారు ఎవ్వరూ లేరు. బహుశా అతడికి ఇక్కడ సహాయం చేసేవారు కూడా ఎవరూ లేకపోవచ్చు. కానీ ఏదైనా సహాయం దొరుకుతుందేమో వేచి చూడాలి.

''చందన్ నీవు పురుకుత్సుడు ఈగ్రామానికి చెందినవాడివా?'' అని అడిగాడు.

'నేను ఇక్కడికి తరచుగా వస్తుంటాను. ఇది నిజం,'' సమాధానమిచ్చాడు చందన్. అతడు పురుకుత్సుడికేసి తేరిపార చూశాడు.

'మేము మీకు ఎలా సహాయపడగలం?'' అని అడిగాడు.

''దయచేసి నన్ను మీ పెద్దవారి వద్దకు తీసుకెళ్లు'' అంటూ పురుకుత్సుడిని కోరాడతడు.

* * *

ఆ గ్రామంలోని కొందరు పెద్దలతో చందన్‌కు సన్నిహిత సంబంధాలున్నాయి. వారిలో ఐదుగురు ఒక వేప చెట్టు నీడలో కూర్చుని ఉన్నారు.



వారిచుట్టూ గ్రామస్థులు చేరి ఉన్నారు. జరుగుతున్న దాన్ని వారంతా ఆసక్తిగా గమనిస్తున్నారు.

''నాదగ్గర ఉన్నవి ఇవే'' పురుకుత్సుడు తన సంపదను చూపించాడు. మెరుస్తున్న బంగారు, రత్నాలు చూసి జనం వెర్రెత్తిపోయారు. ''నా సైనికులు పరుషణి నది గట్లమీద కుములుతున్నారు, మా వద్ద సరైన మందులు లేవు. ఆహారం దాదాపు అయిపోవచ్చింది. మా నగరానికి వెనుదిరిగి పోవాలంటే చాలా సమయం పడుతుంది. అందుకే మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. మాకు సహకరించండి'' అన్నాడు పురుకుత్సుడు.

గ్రామపెద్దలు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ''ఇతరుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోకూడదనే విధానం ఈ గ్రామంలో కొనసాగుతోంది. ఈ విషయం మీరు గమనించాలి? మేం సహాయం చేయడమంటూ జరిగితే మను



త్సుడు. ''అయితే ప్రజలను రక్షించడానికి దాసరాజ్ఞతో యుద్ధం చేయవలసిన పని లేదు. ఒకే ఒక్క వ్యక్తి ప్రేరణవల్ల ఈ యుద్ధం జరుగుతోంది. రాజు సుదాసుడిచే గౌరవిం చబడిన పండితుడతడు'' అన్నాడు చందన్.

''ఆ పండితుడిని సుదాసుడు వంచిం చాడు.'' గొంతెత్తి చాటాడు పురుకుత్సుడు. ''సహజంగానే అతడిప్పుడు న్యాయాన్ని సరిచేయదలిచాడు. ధర్మానికి అనుగుణంగా అతడు వ్యవహరిస్తున్నాడు.''

''ధర్మానికా?'' చందన్ కనుబొమలెగిరే శాడు.

''పది తెగలు కలిసి ఒకరిపై దండుగట్ట డంలో ఏపాటి ధర్మముంది? ఆగ్రహావేశ పరుడై, విచక్షణ కోల్పోయిన వ్యక్తి మాటలు పట్టుకుని ఇంతమంది కలిసి దాడిచేయడం ధర్మమేనా?'' అని ప్రశ్నించాడు.

''సుదాసుడు తన ఆస్థానంలోంచి ఆ పండి తుడిని తీసివేయకుండా ఉండవలసింది.'' పురుకుత్సుడి స్వరం స్థిరంగా వినిపించింది. కాని అతడి కళ్లలో చంచలత్వం స్పష్టంగా కని పించింది.

''ఒకవేళ అతడి స్థానంలో మరొకరు పాల నకు వచ్చినా ఏం జరుగుతుంది? తనకు జరిగిన నష్టంపై అతడూ ఇలాగే వ్యవహరిస్తే సుదాసు అతడిని సులభంగా ఓడించేస్తాడు. ఇప్పటికీ మీ మనుషులను యుద్ధం కోసం కూడగట్టా లని భావిస్తున్నారు. లేదా? మీ జనం బాధలను పోగొట్టడానికి, సుదాసుడిపై దాడి చేయడానికి మీ వనరులను ఉపయోగిస్తారు.'' అన్నాడు చందనుడు త్రసదాస్యుడితో.

''లేదు, నా కుమారుడిని కాపాడటానికే ఇదంతా'' అన్నాడు పురుకుత్సుడు ఒక్కసారిగా.

షులను చంపే వారికే అందుతుంది కదూ!'' అన్నాడు చందన్.

''మీరు తండ్రులు, పుత్రులు, సోదరులు, భర్తలకు సహాయం చేయబోతున్నారు'' అంటూ అభ్యర్థించాడు పురుకుత్సుడు.

''యుద్ధంలో మనుషులు కీళ్లు, అపార రక్తం పోగొట్టుకున్నారు. గాయాలు మాన్పేవారిగా మీ కీర్తి దశదశలా వ్యాపించింది. మీరు సహకరిం చినట్లయితే పది తెగలలో మిగిలి ఉన్న వారి ప్రాణాలను కాపాడినవారవుతారు.'' అన్నాడు.

''అంటే మీరు కోలుకుని మళ్లీ యుద్ధానికి వెళతారన్నమాట'' మృదుస్వరంతో అన్నాడు చందన్.

''మీరు యుద్ధాలకు దూరంగా ఉంటున్న విషయం నాకు అర్థమైంది - కాని మేం ప్రజ లకు సేవ చేస్తున్నాం. మా జీవితాల్లో యుద్ధం ఓ భాగమైపోయింది.'' అన్నాడు పురుకు

''యుద్ధంలో సుదాసుచేత పట్టుబడిన వాడేనా? నీకు వ్యతిరేకంగా ఒనగూరిన ఫలితం మరి. త్రిక్షుల మీద అసూయతో సుదాసుడి సంపద పట్ల ఈర్ష్యతో రగిలిపోయిన తొమ్మిది తెగలు చేస్తున్న యుద్ధం. ఇది న్యాయమేనా.'' పొడిగించాడు చందన్.

ఈ మాటలయుద్ధం పురుకుత్సుడిని నిరుత్తరుడిని చేసింది. అతడు మూగపోయాడు. ''ఈ యుద్ధం పట్ల నేను విచారిస్తున్నట్లు నీకు అనిపించలేదా?'' గొణిగాడతడు.

''నీవు యుద్ధం చేశావు – నష్టపోయావు.'' పురుకుత్సుడు నిర్జీవంగా నవ్వాడు.

''చివరకు పరుషుణి నది కూడా సుదాసుడి పక్షమే వహించింది. దేవతలు అతడి పక్షం వహించారు మరి.''

''ఏ రాజూ ఎడతెగని రక్తపాతాన్ని కోరుకోడు. మీ కుమారుడి కోసం నేను సుదాసుడితో చర్చలు జరిపితే మీరు శాంతి గురించి ఆలోచిస్తారా?'' ప్రశ్నించాడు చందన్.

పురుకుత్సుడు చందన్ కేసి చూసి, ''అవును'' అని సమాధానమిచ్చాడు.

** * **

రెండు నెలల తర్వాత, పురుకుత్సుడు త్రిక్షుల రాజధానిలో ఉన్నాడు. రాజు సుదాసు ఆస్థానంలో సభికులతో పాటు వేచి ఉన్నాడు. అలనాడు ఆగ్రామంలో అతడు చర్చించిన తర్వాత, త్రసదాస్యుడికి ఎలాంటి హానీ కలిగించకుండా విడుదల చేసినప్పుడు పురుకుత్సుడి కళ్లవెంట ఆనందబాష్పాలు జాలువారాయి.

వెంటనే అతడు స్వస్థలం చేరుకున్నాడు. కొద్ది రోజుల్లోపలే సుదాసుడిని సందర్శించవలసిందిగా అతడికి శ్రీముఖం అందింది. దాంట్లో భాగంగానే అతడు ఇప్పుడిక్కడ ఉన్నాడు. అతడు ఆ రోజు తర్వాత చందన్‌ని మరి ఎన్నడూ చూడలేదు. గ్రామ పెద్దలకు కూడా అతడేమయిందీ తెలీదు. రాజాంతఃపురం వైపు ద్వారాలు ఉన్నట్లుండి తెరుచుకున్నాయి. రాజలాంఛనాలతో రాజాస్థానంలో ప్రవేశించిన వ్యక్తిని చూసి పురుకుత్సుడు ఒక్కసారిగా లేచి నిలబడ్డాడు.

ఆ వ్యక్తి తన గడ్డాన్ని తొలగించాడు. రూపు దిద్దినట్లుగా అతడిలో ఏ మార్పూ లేదు. ''చందన్'' అంటూ పురుకుత్సుడు ఆశ్చర్యపడ్డాడు.

''కాదు, కాదు'' రాజు మందహాసం చేశాడు. సుదాస్‌ని, త్రిక్షుల రాజును. పురుస్ రాజుకు స్వాగతం. మా రాజ్యానికి కొత్త ఉషోదయానికి స్వాగతం.

– పవిత్రా శ్రీనివాసన్



# శిథిలాలయం - 3




*(శివాలుడి వెంట పల్లెవాసులందరూ తిరిగి శబరపల్లె చేరారు. విక్రమ కేసరి, శివాలుడికి తాళపత్రాలున్న ఒక సంచీ చూపి, తన తాత మరొకసారి బ్రహ్మపుత్రానదీ లోయలకేసి వెళ్లాడని చెప్పాడు. శివాలుడు, శిఖిముఖిని సంచీ తెమ్మని చెప్పేంతలో, ఒక వికృతాకారుడు వారి ముందు ప్రత్యక్షమయ్యాడు. అందరూ నివ్వెరపోయారు. - తరవాత)*

వికృతాకారుడు శబ్దం చేయకుండా అడుగులో అడుగు వేసుకుంటూ శివాలుణ్ణి సమీపించి, ''మీరందరూ బలవన్మరణం పాలు కాదలచకపోతే, ఆ సంచీ ఇటు ఇవ్వండి, నేను గత వెయ్యేళ్లుగా శిథిలాలయం పూజారిని. దాన్ని చూడదలిచి బ్రహ్మపుత్రానదీ లోయల కేసి వచ్చినవాడెవడూ ఇంతవరకూ ప్రాణాలతో బయటపడలేదు,'' అంటూ సంచీ కోసం చేయిచాపాడు.

అంతలో శివాలుడు భయసంభ్రమాల నుంచి తేరుకుని, వికృతాకారుడి కేసి తీక్షణంగా చూస్తూ, ''ఇంటికొచ్చిన అతిథిని, పిలవని పేరంటంగా వచ్చి దుర్భాషలాడే వాడినైనాసరే, తన్ని తగిలేయడం శబరులు చేయకూడని పనుల్లో ఒకటి. కనుక మర్యాదగా చెపుతున్నాను. వెంటనే బయటకు వెళ్లిపో,'' అంటూ హుంకరించాడు.

''సరే, పోతున్నాను, శిథిలాలయ పూజారి శక్తిసామర్థ్యాలు నీకు తెలియవు. ఈ అవమానానికి ప్రతీకారం చేసి తీరుతాను. ఆ సంచీలో ఉన్న తాళపత్రాలు నీ వంశనాశనానికీ, విక్రమ కేసరి వంశనాశనానికి మాత్రమే ఉపయోగిస్తవి,'' అంటూ వికృతాకారుడు ద్వారం కేసి వెళ్లి కనపడకుండా పోయాడు.

దాసరి సుబ్రహ్మణ్యం

అతడు తలుపు తెరవటం, మూయటం ఎవరికంటాబడలేదు.

శిఖిముఖీ, విక్రమకేసరీ చప్పున లేచి ద్వారం దగ్గిరకు పోయి తలుపు తెరిచి బయటకి చూశారు. బయట అంతా కన్ను పొడుచుకు చూసినా కనిపించని చీకటి. వికృతాకారుడు కనిపించలేదు.

ఇంటిచుట్టూ ఉన్న కంచెదారి దగ్గిర ఇద్దరు ముగ్గురు శబరులు నిలబడి ఇంటికి కాపలా కాస్తున్నారు. శిఖిముఖి వాళ్లను సమీపించి, ''పిశాచంలా - అంతపొడవున్న నల్లదుస్తులవాడు ఎటుపోయాడు?'' అని ప్రశ్నించాడు.

''నల్లదుస్తులవాడా? అలాంటివాడెవడూ ఇటు రాలేదే?'' అంటూ కావలివాళ్లు ఆశ్చర్యపోయారు. అంతలో ఎర్రగండు పెద్దగా మొరుగుతూ కొలను కేసి పరిగెత్తసాగింది.

విక్రమకేసరీ, శిఖిముఖీ దాన్ని వెంబడించారు. వాళ్లిద్దరూ కొలను ప్రాంతం చేరేసరికి, కొలనులో దభీమంటూ ఏదో బరువైన వస్తువు పడిన శబ్దం వినబడింది.

కొలను చుట్టూ ఒత్తుగా పెరిగి ఉన్న చెట్ల చాటున నీడల్లా మానవాకారాలు కదలటం కనబడింది. విక్రమకేసరి చిన్న గొంతుతో, ''శిఖిముఖీ! అరణ్యంలో నన్ను దొంగచాటుగా ముట్టడించిన దుర్మార్గులకు, ఆ వికృతాకారుడు నాయకుడని తెలుస్తూనే ఉన్నది. వాణ్ణిగాని లేక వాడి అనుచరుల్లో ఒక్కగా నొక్కణ్ణయినా గాని మనం పట్టుకోగలిగితే, వికృతాకారుడి ఎత్తుగడలేమిటో మనం తెలుసుకోవచ్చు,'' అన్నాడు.



''బావుంది. ఆలా అయితే ఇద్దరం ఒకే దిక్కుకేసి వెళ్లటం కన్న చెరొకవైపుగా పోవడం మంచిది. వాళ్లు సాహసికులు, ఈటె ఉపయోగించడానికి వెనుదీయకు. గాయపడినవాడు దొరికినా మన ప్రయత్నం ఫలిస్తుంది.'' అంటూ శిఖిముఖి కొలనుకు ఎడమవైపు ఉన్న చెట్లకేసి దౌడు తీశాడు. విక్రమకేసరి కుడివైపుకు పరిగెత్తాడు.

గుబురుచెట్ల వెనకనుంచి శిఖిముఖికి దొంగల మాటలూ, వాళ్లు నడుస్తున్నప్పుడు కాలికింద పడిన ఎండుటాకులు చేసే కరకర ధ్వనీ వినబడింది.

ఎర్రగండు చాలా దూరం నుంచి మొరుగుతున్నది. అది అందరికన్న ముందుపోతున్న దొంగనెవడినో వెంబడిస్తున్నట్లుంది. కుక్కను పిలిస్తే తనకెంతో సహాయంగా ఉంటుంది. కాని, దొంగలకు తను వాళ్లను వెంబడిస్తున్నట్లు తెలిసిపోతుంది.



పల్లె యువకుల్ని ముందుగా హెచ్చరించి ఉన్నట్లయితే, వాళ్లందరి సాయంతో దొంగలను చుట్టుముట్టి పట్టుకుని ఉండవచ్చు. తనూ, విక్రమకేసరీ ఒంటరిగా బయలుదేరటం పొరపాటే అయింది. ఇప్పుడేం చేయాలి?...

శిఖిముఖి ఆలోచిస్తున్నంతలో దొంగల్లో ఒకడు కొంచెం బిగ్గరగా, ‘‘పదండి, పదండి, పూజారి దొర మూడోకన్ను తెరిచాడు!’’ అన్నాడు.

ఆ వెంటనే నలుగురైదుగురు దొంగలు చెట్లమాటునుంచి గబగబా, బయటకు వచ్చి కొలనుకు అల్లంత దూరంలో ఉన్న మామిడితోపు కేసి పరిగెత్తసాగారు.

పూజారి దొర మూడోకన్ను తెరవటం ఏమిటి? అని ఆశ్చర్యపడుతూ శిఖిముఖి మామిడి తోపు కేసి దృష్టి సారించాడు. అక్కడ ఒక మాను పక్కగా ఆరేడడుగుల ఎత్తున ఏదో కాంతి కనురెప్పపాటులో ఆరుతూ వెలుగుతూ అతడి కంటబడింది. అది పూజారి మూడోకన్నా!-అద్భుతం! వాడు వెయ్యేళ్లుగా శిథిలాలయానికి పూజారిగా ఉంటున్నట్లు చెప్పాడు. ఇప్పుడు మూడో కన్ను తెరిచి మూస్తున్నాడు. ఇదంతా మోసమా లేక వాస్తవమా?...

శిఖిముఖి ఇలాంటి సంశయాలతో కొట్టుమిట్టాడుతూనే మామిడితోపు కేసి పరిగెత్తబోయేంతలో, ఎర్రగండు దెబ్బతిన్నదానిలా కుయ్యోయ్యోమంటూ పెద్దగా అరిచింది. ఆ అరుపు వింటూనే శిఖిముఖి ఉగ్రుడైపోయాడు.

తన కుక్కను దొంగల్లో ఎవడో గాయపరిచి ఉంటాడు. వాళ్లనెత్తురు కళ్లచూడవలసిందే. పూజారి గుండెల్లో ఈటె గుచ్చి తీరతాను. ‘జై శబరమాతా!’ అంటూ శిఖిముఖి కేక పెట్టి, మామిడితోపులో వెలుగు కనబడుతున్న వైపుకు సూటిగా పరిగెత్తాడు.

అతడు తోపును సమీపించబోతున్నంతలో అంతవరకూ మాను పక్కన కనబడుతున్న వెలుగు కాస్తా మాయమయింది. ఆ వెంటనే ఎవరో చిన్నగా మాట్లాడిన ధ్వనీ, నలుగురైదుగురు నడిచి పోతున్న శబ్దమూ శిఖిముఖికి వినబడింది.

అతడు ఆ శబ్దం వస్తున్న వైపుకు జాగ్రత్తగా నడవసాగాడు. చెట్లమాటునుంచి ఏ శత్రువైనా తన మీద కత్తి విసరవచ్చునన్న భయం అతడికి కలిగింది.

శిఖిముఖికి తనకు కొంచెం ముందుగా నడిచిపోతున్న వాళ్లు మాట్లాడుకోవటం మరింత



స్పష్టంగా వినబడింది. వాళ్లు తనను చూసే అంత నిర్భయంగా నడుస్తున్నారా అనుకు న్నాడతను.

అంతలో దొంగల్లో ఒకడు కొంచె పెద్దగానే, ''అది కుక్క కాదు, పిశాచం. పూజారి దొరను చూస్తూనే కుయ్ కుయ్ మనకుండా దాని దవడలు నొక్కుకుపోయినై,'' అన్నాడు.

వాడు మాట్లాడుతున్నది తన ఎర్రగం డును గురించి. దాన్ని ఈ నీచులు చంపారా? ఆ అనుమానం కల్గగానే శిఖిముఖి కోపంతో ఒళ్లు మరిచాడు. ఆ స్థితిలో అతడు వెనకా ముందులు చూసుకోకుండా, ''దుర్మార్గు లారా, ఆగండి! ఈటె దెబ్బ కాచుకోండి!'' అంటూ ముందుకురికాడు.

కాని, అతడు నాలుగైదు అడుగులు వేశాడో లేదో, ఎడమ కాలి కింద భూమి ఉన్నట్లుండి చప్పున కుంగిపోయింది. ముందుకు పడబోయిన వాడల్లా తమాయిం చుకుని, కుడికాలి ఊతంతో ఎడమకాలును పైకి లాగబోయేంతలో, కాలికి తాడులాంటి దేదో గట్టిగా బిగుసుకు పోయి పైకి గుంజింది.

మరుక్షణం శిఖిముఖి చెట్టుకొమ్మ కొక దానికి ఒంటికాలి పట్టుతో తలకిందులుగా వేళ్లాడసాగాడు. అదృష్టం కొద్దీ అతడి కుడి చేతిలో ఉన్న ఈటె గుప్పెట పట్టునుంచి జారిపోలేదు.

తను ఎంత ఘోర ప్రమాదంలో చిక్కుకు న్నదీ అర్థ చేసుకునే లోపలే చెట్లచాటు నుంచి అపహాస్యం చేస్తున్నట్లు పకపకమంటూ నవ్వు వినిపించింది.

ఆ వెంటనే ఒక గొంతు, ''పూజారి దొరా! కొదమసింగాన్ని అనుకునేవాణ్ణి, కుందేలు పిల్ల కింద ఉచ్చులో పట్టేశాం. ఇప్పుడేం చేద్దాం?'' అని అడిగింది.

''తొందరపడి అప్పుడే వాడి చర్మం ఒలచ కండి. కొంచెం ఎడం.. మరీ సమీపానికొస్తే నా మూడోకంటి వేడికి భస్మమైపోతారు,'' అంటూ వికృతాకారుడు చెట్టుచాటునుంచి బయటికొచ్చాడు.

అతడు తన మూడో కన్ను అంతలోనే మూయటం, తెరవడం శిఖిముఖి చూశాడు. ఈ వికృతాకారుడా శిథిలాలయ పూజారి? అనుకున్నాడు శిఖిముఖి.

తమ ఇంటిలోకి వచ్చినప్పుడు వీడికి నిప్పులో భగ్గుభగ్గున మండుతూ ఆరే మూడో కన్ను ఉన్నట్లు తాను గమనించలేదు. వాడు ఈటె పోటుకు అందేంత సమీపానికి వస్తే ఎంత బావుండును, అనుకుంటూ శిఖి ముఖి ఈటెను బాగా చాచి, పూజారి కేసి

ఊగేందుకు శరీరాన్ని అటూ ఇటూ బలంగా విదిలించాడు.

అతడి ప్రయత్నం ఏమిటో గ్రహించిన ఇద్దరు ముగ్గురు దొంగలు, తమ నాయకుడిని ప్రమాదం నుంచి కాపాడేందుకు శిఖిముఖి పక్కకు వచ్చి నిలబడ్డారు.

''ఓహో, ఈ ఆటవికుడు తన చేతిలోని పూచిక పుల్లతో నన్ను పొడవాలని చూస్తున్నట్లున్నదే! అంటూ ఒక్క క్షణం ఆగి, అంతలోనే పెద్దగా చప్పట్లు చరుస్తూ, తల తిప్పగలిగితే చూడరా, పక్షీ! నీ శబర పల్లెను నా మూడో నేత్రానికి ఆహుతి చేస్తున్నాను,'' అన్నాడు.

శిఖిముఖి బలవంతంగా తల పక్కకు తిప్పి పల్లెకేసి చూశాడు. పల్లెలో పెద్ద మంటలు లేస్తున్నవి. పల్లె తగలబడిపోతున్నట్లు తెలియగానే అతడు ఎక్కడ లేని ఉద్రేకంతో, కాలిని బిగించి పట్టి ఉన్న తాడును తెంచుకునేందుకు పెనుగులాడుతూ, ''దుర్మార్గుడా, నీ సేవకుల్ని పంపి, పల్లెకు నిప్పు పెట్టించావా? నీకు చావు తప్పదు. కొద్దిసేపట్లోనే మా వాళ్లంతా ఇక్కడికి వచ్చి నిన్ను చిత్రవధ చేస్తారు.'' అన్నాడు.

పూజారి పకపక నవ్వి, ''మీ వాళ్లంతా తెగబడి ఇక్కడికి రాకుండా ఉండేందుకే మీ పల్లెకు అగ్గి పెట్టాను.

అక్కడ అందరూ ఎవరి కొంపలు వాళ్లు చల్లార్చుకునే ప్రయత్నంలో ఉంటారు. అది సరే కాని, నిన్ను ప్రాణాలతో వదుల్తాను. ఆ తాళపత్ర గ్రంధాలున్న సంచీ నాకు తెచ్చిస్తావా?'' అన్నాడు.

''తాళపత్రాలు కాదు, నీ తల నరికి విక్రమకేసరికి ఇవ్వబోతున్నాను,'' అంటూ శిఖిముఖి బాగా చేయి చాచి ఈటెను పూజారి కేసి విసిరాడు.

కాని, అదే సమయంలో ఒక దొంగ అడ్డు రావడంతో ఈటె వాడి భుజంలో గుచ్చుకున్నది. వాడు ఒక చావుకేక పెట్టి విరుచుకు పడ్డాడు.

''వీడు నేననుకున్న దానికన్నా మూఢుడు, సాహసి. కాలికట్టువిప్పి, మెడకు తగిలించి లాక్కురండి. నేను మహావృక్షాల మీదుగా నడిచి అడ్డదారి వెంట అరణ్యం చేరతాను,'' అంటూ పూజారి పెద్ద పెద్ద అంగలు వేస్తూ మాను చాటుకు వెళ్లిపోయాడు.

(ఇంకా ఉంది)



# విచిత్ర జీవి

నేను అంతకు మించిన వివరాలను తనను౦చి అడిగి తెలుసుకోలేదు. అతడు అన్యాపదేశంగా ఆ మాట అన్నాడు. అది నాకు తెలుసు. మేము అక్కడే కూర్చుని జరిగిన పరిణామాలను కలబోసుకుంటూ ఉన్నాము. ఉన్నట్లుండి దూరంనుంచి శబ్దం వినిపించింది. లడ్డూ ఉన్నట్లుండి పిచ్చిగా మొరగసాగింది. ఇతర మానవుల వాసనను అది పసిగట్టింది. వారు



గుహల్లోకి నడుస్తున్న శబ్దం విన్నాను. మయూరి కూడా వారితో ఉందా? నా కనుబొమలనుంచి చెమట చుక్క కారటం గమనించాను. ఏదో ఒకటి జరిగేంతవరకు నేను ఆగలేకపోయాను.

మొట్టమొదటగా నడుస్తున్నవాడు శంతను. అతడు నన్ను చూసి చెప్పాడు. ''ఓ.. నువ్వు ఇక్కడున్నావన్న మాట...'' తాతయ్యను చూడగానే అతడి స్వరం మారిపోయింది.

''డాక్టర్ పురంజన్''! మిమ్మల్ని ఇక్కడ చూడటం ఆశ్చర్యంగా ఉంది.'' అంటూ నవ్వాడతడు. తాతయ్య తాను కూర్చున్న చోటి నుంచి లేచాడు. అతడు పట్టీపట్టనట్లుగా తన చేయి చాచి చెప్పాడు, ''శాస్త్రజ్ఞుడి పాత్రను పోషించడానికి నీవు సరిపోతావు శంతనూ. బాలీవుడ్‌లో నీవు ప్రయత్నించలేదా?''

''హహ్హాహ్హా,'' శంతను పొడిగా నవ్వాడు. నిమ్మీ, హర్షాలతో కలిసి లడ్డూ ఆడుకుం టోంది. ఇతర మానవులు కూడా మెల్లగా లోపలికి అడుగుపెట్టారు. శంతనుకి మయూరి తగిన సూచనలు ఇచ్చి ఉంటుందని, మాన వులను అతడే ఇక్కడికి తీసుకువచ్చి ఉంటా డని నేను ఊహించాను.

'నేను బాగా అలసిపోయాను!'' ఒకతను విసుగు చెందుతూ పెద్దగా అరిచాడు.

ఇతరులు సణిగారు. ''ఇదెంత భయంకరమైన స్థలమో?'' అని వారిలో ఒకామె అడిగింది. ఆమె తల గుహ గోడను ఆనుకుని ఉంది. ఎవరూ ఆమెకు జవాబివ్వలేదు. వారిలో ప్రతిఒక్కరూ ప్రయాణభారంతో నలిగిపోయారు. నిమ్కి, హర్షాలు మినహాయిస్తే మిగిలిన వారందరూ అనువైన స్థలం ఎంచుకుని నిద్రపోవడానికి ఉపక్రమించారు.

శంతను ఈలోగా తాతయ్య దగ్గిరకు వెళ్లి అతడి పక్కన కూర్చున్నాడు. నేనూ వారితో చేరిపోయాను. వాళ్లిద్దరూ ఒకరికొకరు ఎలా పరిచయమయ్యారో తెలుసుకోవాలని నాకూ కుతూహలంగానే ఉంది. అయితే ఈవిషయం నేరుగా వారితో ప్రస్తావించాలని నేను అనుకో లేదు. ఈ సందర్భంగా అలా చేయడం సర యినదని నాకనిపించలేదు.

''అయితే, నీవు భూమిని ఇంకా కాపాడ లేదన్నమాట?'' అడిగాడు శంతను సన్నగా నవ్వుతూ.

''బావుంది. నీవు ప్రస్తుతం ఇక్కడే ఉన్నావు కాబట్టి భూమిని కాపాడే ప్రయత్నాలేవీ చేయ నక్కరలేదు మరి.'' అన్నాడు తాతయ్య మంద్ర స్వరంతో.

''డాక్టర్ పురంజన్ గారూ, మీరు ఇంతటి మంచివారెలా అయ్యారు? ఈ ప్రపంచంలో ఏ శక్తి కూడా శాస్త్రీయ పురోగతి మార్గంలో అడ్డుగా నిలబడలేదని మేమంతా విశ్వసించడా నికి ముమ్మాటికీ మీరే కారణం.'' అన్నాడు శంతను.

''కళ్లనిండా చీము ఉండే కుందేలుపిల్ల మనకు శాస్త్రీయ కృషే అవుతుందా?''



''ఆ... ఏమిటది?''

''స్పైక్ మిల్లిగాన్ అని ఓ కవి రాశాడులే ఈ విషయం.'' నవ్వాడు తాతయ్య.

''మీరు మరీ మెతకగా అయ్యారు. కాదా? ముసలితనం మిమ్మల్ని కవిత్వం వైపుకు మళ్లించింది కదూ? చంద్రుడిగురించి రూప కాలు మీరు పాడలేదా?'' అడిగాడు శంతను.

నాకు ముళ్లపై కూర్చున్నట్లుంది. మర్యాద ఎరుగని ఈ మనిషి ఎవరు? అతడు తాత య్యను రెచ్చగొట్టడానికి ఎందుకు ప్రయత్ని స్తున్నాడు?

''పాడడానికి ప్రయత్నించానే,'' అన్నాడు తాతయ్య. ''అయితే నా శ్రుతి నాకే నచ్చలేదు'' అంటూ ముగించాడు.

''మీరు ఇక్కడ ఎందుకున్నారో తెలుసు.'' అన్నాడు శంతను ఉన్నట్లుండి. అతడి ముఖం



మొట్టమొదటిగా కలుసుకున్న వారిలో నేనూ ఒకడిని. అర్థమైందా?'' అంటూ ఉరిమాను.

శంతను ఆశ్చర్యంతో నాకేసి చూశాడు. నేను అతడి పక్కన కూర్చుని ఉన్న విషయం మర్చిపోయినట్లున్నాడు.

''డోడోలు నిన్ను ఎలా కనుగొన్నారనుకుంటున్నావు అబ్బాయ్, అనుకోకుండా అలా జరిగిందంటావా? ఆ నీల దేహం కలదాని నుంచి వారు నిన్ను బయటపడేయగలరని అనుకుంటున్నావు కదూ.''

నేను గందరగోళంలో పడ్డాను. అతడు ఏదో విషయం దాచిపెడుతున్నాడని నాకు తెలుసు. అయితే అతడు ఏం చెబుతున్నదీ నాకు బోధ పడటం లేదు.

అతడు కూడా అనునిర్వలో అడుగుపెట్టినప్పుడు ఇతరులకు మల్లే బాగా గందరగోళపడి ఉంటాడు. కాని ఇప్పుడు మాత్రం అనునిర్వను తాను ఎప్పట్నుంచో ఎరిగి ఉన్న వాడిలా నటిస్తున్నాడు. నేను దీన్ని గ్రహించలేకపోయాను.

''సరే, ఇంతకూ నీవు చెబుతున్నదేమిటి? నేను సవాలు చేశాను.''

''వారికి ఆదేశాలు వచ్చాయి కాబట్టే వాళ్లు నిన్ను కనిపెట్టారు. లక్ష్యం కోసం నిన్ను ఎంపిక చేసుకున్నారు.'' అన్నాడు శంతను.

ఇది నిజమో కాదో నిర్ధారించుకోవడానికి నేను తాతయ్యవైపు తిరిగి చూశాను. అయితే ఆయన ముఖం భావరహితంగా ఉంది. అతడి మనస్సులో ఏముందో నాకు తెలీటం లేదు.

''శంతనూ, ఇంకా చాలాసమయం ఉంది.'' అన్నాడు తాతయ్య. ''నీవు నాకు చెప్పిన కథ వికారంగా ఉంది. నేను గుహ నేలలోంచి పొడుచుకువచ్చిన వాడి శిలపై నా చేయి ఆనించాను.

''మీ కథ వినడానికి నాకు ఎంతో ఆసక్తిగా ఉంది శంతనూ, ఇది నిదురించే సమయం కదా, కథమొదలెట్టేందుకు సరైన సమయమనుకుంటాను.'' చెప్పాడు తాతయ్య.

''మేమెవరమూ రాక ముందే ఇక్కడికి రావాలని మీరనుకున్నారు. ఇది మీకు ఎప్పటినుంచో తెలుసు. మీ ఎన్జీఓ పని మొత్తంగా బూటకం!''

''ఏయ్!'' అరిచాన్నేను. నన్ను నేను ఇక నిగ్రహించుకోలేకపోయాను. అక్కడ కూర్చుని అతడు వాగుతుంటే చూడలేకపోయాను.

''నేను మాతాతయ్యను కాను. సరేనా, ఇక్కడ ఉన్నది శివా. అనునిర్వ వాసులను

చాలా బాగుంది. కాని మనం నిద్రపోయే సమయం వచ్చిందనుకుంటాను.'' అని గుర్తు చేశాడు.

శంతను వాడిగా చూశాడు. ''మీ మనవడు మీగురించి చెడుగా అనుకుంటాడని భయ పడుతున్నారు కదూ,'' అని రెచ్చగొట్టాడు.

''నేను ఇప్పుడు ఎవరి గురించీ భయప డటం లేదు శంతనూ, నేను గతంలో ప్రతి చిన్నదానికి భయపడేవాడిని. అందుకే నేను శక్తిమంతుడు కావాలని అనుకున్నాను. కాని ఇప్పుడు భయమంటే ఏమిటో పూర్తిగా మర్చి పోయాను తెలిసిందా?'' అన్నాడు తాతయ్య.

''పసందైన ప్రసంగం డాక్టర్‌పురంజన్. కానీ, మనం ప్రయోగశాలలో గంటలపాటు కలిసి పని చేయవలసి వచ్చిన రోజుల్లో మీ నుంచి ఇలాంటి ప్రసంగాలెన్నో వినివున్నాను. శ్రద్ధాస క్తులతో విద్యార్థులమంతా కలిసి దైవసమా నుడిగా ఉన్న మీ చుట్టూ చేరి విధిని మార్చడం ఎలాగో అని మీరు చెబుతూంటే వింటూ వచ్చాము.'' అన్నాడు శంతను.

తాతయ్య చిరు నవ్వునవ్వి పొడిపొడిగా చెప్పాడు. ''పిల్లల ఆస క్తికర జ్ఞాపకాలు లేక పోతే మనిషిగా మార డంలో అర్థమేముం టుంది?

నీవింకా నిద్రపో లేదా శివా? ఇక్కడికి వచ్చి నా పక్కనపడుకో మరి,'' తాతయ్య మరోమైపు లడ్డూని చిన్నగా పిలిచాడు. అది తోక ఊపుకుంటూ అతడి వద్దకు వచ్చింది. నిమ్మీ, హర్షాలు చాలా త్వరగా నిద్రపోవటంతో దానికి విసుగ్గా ఉంది.

''తాతయ్యా,'' అంటూ మొదలెట్టాను.

''నీలో చాలా ప్రశ్నలు గూడు కట్టుకుని ఉన్నట్లు నాకు తెలుసు. నీకు నేను నిజం చెబుతాను. కాని ఇప్పుడు కాదు. పరిణా మాలు వేగంగా ముంచుకొచ్చాయి. వాటి గురించి నేను యోచించాలి మరి,'' చెప్పాడు తాతయ్య.

నేను తలూపాను. నేను కాళ్లు చాచి ఆలో చనలో మునిగిపోవడంతో ఒక్కసారిగా నిద్ర కమ్ముకొచ్చింది. మళ్లీ నాకు మెలకువ రాగానే గుహలో చీకటి అలుముకుని ఉంది. ఏమీ చూడలేకపోతున్నాను. సమస్త ప్రపంచమూ గాడాంధకారంలో మునిగి ఉంది. మిణుగు రులు వెళ్లిపోయాయి. చీకటికి నా కళ్లు అలవాటుపడగానే, గుహలోపలి ఆకృతులు,



ఛాయలు నాకు కనబడసాగాయి. ఉన్నట్లుండి నాకు ఓ శబ్దం వినిపించినట్లయింది. గుహ చుట్టూ ఏదో నిశ్శబ్దంగా తిరుగుతున్నట్లు ఉంది. లడ్డూ ఉద్రిక్తంగా ఉన్నట్లు గమనించాను. అది కూడా దాన్ని పసిగట్టింది. ఏం జరిగినా ఎదుర్కోవడానికి నేను సంసిద్ధంగా ఉన్నాను.

అది నేను పడుకుని ఉన్న చోటికే వచ్చింది. దాని చిన్న పాదం నేలమీద కదులాడుతుండటం గమనించాను. తర్వాత తొలుత శబ్దాలు ఉన్నట్లుండి మొదలయినట్లే ఆకస్మికంగా ఆగిపోయాయి. అది నాపక్కనే నిలబడి నా ముఖం కేసి చూస్తున్నట్లు గమనించి వణికిపోయాను. నా పొట్ట పక్కనే దాని కీళ్లు వంగి ఉన్నట్లున్నాయి. అవి దాని రెక్కలు కాబోలు... అవి నా మోకాలిని తాకుతున్నాయి. గుండె వేగంగా కొట్టుకుంది. ఆ ప్రాణికేసి చూసి, అది ఎలా ఉందో పరిశీలించడానికి ప్రయత్నించాను.

అది వికారంగా ఉండటం కనిపించింది. అది నేను ఇంతకుముందు చూసిన ఏ ఇతర ప్రాణిలాగా కనిపించడం లేదు. అది అనునిర్వాలో అరుదైన ప్రాణి కాదు.

తర్వాత, నేను ధైర్యం కూడగట్టుకుని దానికి ఏం కావాలని అడిగేలోగా నేనొక మంద్రస్వరాన్ని విన్నాను.

"విచిత్రజీవీ, ఓ విచిత్రజీవీ, ఇక్కడికి రా!"




అది శంతను స్వరం. తాను ఎవరో పసిపాపతో మాట్లాడుతున్నంత మెత్తటి స్వరం.

విచిత్రజీవి వినయంగా వింటున్నట్లు గమనించాను. దానికి శంతను స్వరం తెలుసు. దాంట్లో సందేహపడవలసింది లేదు. అది నెమ్మదిగా తన కుడి పాదాన్ని గాలిలోకి లేపి దాని మరో పాదం వద్ద దింపింది. తర్వాత అది శంతను స్వరం వినిపించిన దశగా కదలడం మొదలుపెట్టింది.

నా ఊపిరిని బిగపట్టి చాలాసేపయిందని గుర్తించాను. నా రక్తప్రసరణ సజావుగా సాగేందుకు గాను కాస్త ఊపిరి వదిలాను.

అటుపై నాకు నిద్ర పట్టలేదు. ఈ విచిత్రజీవి ఎవరు? ఇదెలాంటి ప్రాణి? ఇది అనునిర్వాకు చెందినదేనా? లేదా శంతను ఇక్కడికి వచ్చినప్పుడు తనతోపాటు దాన్ని తీసుకువచ్చాడా? *(ఇంకా ఉంది)*

– సౌమ్య రాజేంద్రన్



# నవ్వుల పువ్వులు




టీచర్: మనం కొన్ని సందర్భాల్లో మధ్యయుగాలను చీకటి యుగాలుగా పిలుస్తుంటాము. ఎందుకు?

సునీల్: మరి వాళ్లు ఎక్కువ సమయం చీకట్లోనే గడిపేవారు కదా!




బాబు ఒన్ వే ఉన్న వీధిలో తప్పుదోవలో కారు నడుపుకుంటూ పోతుండగా పోలీసు అడ్డగించాడు. 'ఇది వన్ వే స్ట్రీట్' గద్దించాడు పోలీసు. 'నాకు తెలుసు' చెప్పాడు బాబు. ''నేను ఒక దారిలో మాత్రమే పోతున్నాను గదా.''




డాక్టర్: యంగ్ మ్యాన్, మిమ్మల్ని సైన్యంలో చేర్చుకోనందుకు ఏదైనా వైద్యపరమైన కారణం ఉందా?

వ్యక్తి: నన్ను నమ్మండి, నాలోపలి అవయవాలు సగం మేరకు తప్పిపోయాయి.

డాక్టర్: మీ అంతర్గత సమస్య ఏమిటి?

వ్యక్తి: తెగింపు లేదు.

ఒక రోజు నరేష్ వీధిలో కనబడిన వైద్యుడిని నిలవేసి ఇలా అన్నాడు. ''నేను మీకు గుర్తున్నానా? నా కీళ్ల నొప్పులను కొంత కాలం క్రితం మీరు నయం చేశారు.''

''అవును నాకు గుర్తుంది,'' చెప్పాడు డాక్టర్

''మంచిది, నేను స్నానం చేయడం ఇప్పటికీ మంచిది కాదని మీరు భావిస్తున్నారా''

అడిగాడతడు.




## అల్లరి దత్తు











# పిల్లులతో పరీక్ష



శ్రీపురాన్నేలే విద్యాధరుడనే రాజుకు, సుద ర్శనుడు మంత్రి, శ్రీపురం చాలా చిన్న రాజ్యం అయినా సిరిసంపదలతో చక్కగా అలరా రుతూ ఉండేది. దాని పొరుగున సైనిక బలంలో పెద్దవైన కొన్ని రాజ్యాలుండేవి.

అయినా, మంత్రి సుదర్శనుడి కుశాగ్ర బుద్ధీ, రాజ్యతంత్రంలో నేర్పు వల్ల, ఆ పెద్ద రాజ్యాలు శ్రీపురాన్ని ఆక్రమించేందుకు ఏనాడూ ప్రయత్నించలేదు.

సుదర్శనుడికి క్రమంగా వయసు పైబడి వృద్ధాప్య దశకు వచ్చాడు. ఆయన తరచూ అనారోగ్యానికి గురవుతూండేవాడు. ఆస్థాన వైద్యులు ఆయనకు మంత్రి పదవినుంచి విరమించి విశ్రాంతి తీసుకోవలసిందిగా సలహా ఇచ్చారు.

ఈ సంగతి విన్న రాజు విద్యాధరుడు ఆయనతో "వైద్యుల సలహాను బట్టి చూస్తే తమరు పదవీ విరమణ చేయడం ఇకపై తప్పనిసరిగా కనబడుతున్నది. పదవిలో ఉండగానే, మీ బుద్ధిని ఉపయోగించి రాజ్యానికి ఒక మంత్రిని ఎన్నిక చేయవలసిం దిగా కోరుతున్నాను" అన్నాడు.

సుదర్శనుడు దానికి అంగీకరించి, మంత్రి పదవికి అర్హులైన వారికోసం రాజ్యంలో చాటింపు వేయించాడు. అది విన్న విద్యాధి కులైన ఎందరో యువకులు రాజధానికి వచ్చి, సుదర్శనుడిని చూడబోయారు.

ఆయన వారికి ఎన్నో పరీక్షలు పెట్టి, అన్నిటిలోనూ సరిసమాన ఉజ్జీలనిపించు కున్న ముగ్గురిని ఎన్నిక చేశాడు. ఇక వారిలో ఒకరిని మంత్రిపదవిలో నియమించడమే మిగిలి ఉన్నది.

వినయుడు, చంద్రకాంతుడు, శ్రీధరుడు అన్న ఆ ముగ్గురు యువకులనూ సుదర్శ నుడు ఒకానొక రోజు, రాజు సమక్షంలో సభలో ఉన్నవారందరికీ పరిచయం చేశాడు.

రాజ సేవకుల ద్వారా ఒక్కొక్కరికి బాగా బక్కచిక్కిన ఒకొక్క పిల్లిని ఇప్పించి, "మీరు

అనుపిండి శ్రీనివాసరావు

మూడు నెలల కాలం ఈ పిల్లులను మీకు తోచిన విధంగా పెంచండి. అందుకుగాను ఖజానా నుంచి తలా వెయ్యి బంగారు కాసులు తీసుకోండి. మూడు నెలల తరవాత మీమీ పిల్లులతో ఇక్కడికి రండి'' అని చెప్పాడు.

సరిగ్గా మూడు నెలల తరవాత వినయుడూ, చంద్రకాంతుడూ, శ్రీధరుడూ తమ తమ పిల్లులతో సభకు వచ్చారు. రాజాస్థానం ఆహూతులతో నిండిపోయింది.

వినయుడి పిల్లి చాలా బలిష్టంగా ఉన్నది. దానిని చూసి సభలో చాలామంది, ఇది పిల్లా లేక వయసువస్తున్న పులిపిల్లా అనుకున్నారు. శ్రీధరుడి పిల్లి ఆరోగ్యంగా, పుష్టిగా కనులకింపు కలిగిస్తున్నది.

ఇక చంద్రకాతుడి పిల్లి మాత్రం మరింతగా బక్కచిక్కిపోయి రేపోమాపో చావడానికి సిద్ధంగా ఉన్నట్లు కనిపించింది.

సుదర్శనుడు ఆ ముగ్గురినీ, పిల్లులను పెంచిన తీరు సభకు వివరించి చెప్పమని అడిగాడు.

ముందుగా వినయుడు, ''మీరిచ్చిన డబ్బుతో పిల్లికి పాలూ, వెన్నలతో పాటు పంచభక్ష్యపరమాన్నాలూ పెట్టాను. అందుకు ఖర్చవగా మిగిలిన ఐదువందల బంగారు కాసులు ఇవిగో'' అన్నాడు.

తరవాత శ్రీధరుడు, ''పిల్లి ప్రధానంగా మాంసాహారి కదా. అందువల్ల దాన్ని బాగా ఎలుకలు ఉన్న, నా మిత్రుడి ఇంట వదిలేవాడిని. అయితే రోజూ దానికి కడుపునిండుగా ఆహారం దొరక్కపోవచ్చున్న సంశ



యంతో, పొద్దుటిపూట పాలు పోసేవాడిని. అందుకైన ఖర్చులు పోగా, ఇవిగో మిగిలిన తొమ్మిదివందల బంగారు కాసులు!'' అని చూపించాడు.

చివరగా చంద్రకాంతుడు, ''పిల్లికి ప్రత్యేకంగా నేనేమీ ఆహారం పెట్టలేదు. అది చేతనైనంతలో ప్రతి రోజూ తన ఆహారం తాను సంపాదించుకుంటూ ఉన్నది. పిల్లి లాంటి నిరుపయోగమైన జంతువు మీద డబ్బు ఖర్చుపెట్టడం వృథా. ఇవిగో మీరిచ్చిన బంగారుకాసులు. వీటితో ప్రజోపయోగకరమైన పనులు చేయవచ్చు,'' అన్నాడు.

సభలో ఉన్నవారందరూ ఈ ముగ్గురు పోటీదారులలో చంద్రకాంతుడు మంత్రిగా ఎన్నిక కాగలడని భావించారు.

కాని, అందరి అంచనాలకు భిన్నంగా సుదర్శనుడు రాజుతో, సభికులతో, ''శ్రీపురానికి మంత్రి కాగల అర్హత ఉన్నవాడు శ్రీధ

రుడు మాత్రమే,'' అన్నాడు. ఈ మాటలు రాజు విద్యాధరుడితో పాటు, సభికులకు కూడా ఆశ్చర్యం కలిగించినై.

అది గ్రహించిన సుదర్శనుడు, ''పిల్లు లను పెంచిన తీరు ఈ ముగ్గురు చెప్పగా మీరంతా విన్నారు కదా!

వినయుడిలో ఇంగితజ్ఞానం పాలు కాస్త తక్కువ. చెప్పింది చెప్పినట్లు చేయడం తప్ప స్వంత ఆలోచన అణుమాత్రం లేనివాడు. ఒక పిల్లిని పెంచేందుకు, మూడునెలల కాలంలో ఐదువందల బంగారు కాసులు వృధాగా వ్యయం చేశాడు.

చూడ్డానికి ఎంత బలంగా, చురుగ్గా ఉన్నా - పిల్లి ఎలుకలను పట్టడానికి మించి చేయగల ఘనకార్యం ఈ ప్రపంచంలో ఏమీ ఉండదు!

ఇక చంద్రకాంతుడి సంగతి: అతడిలో వివేకాన్ని మించిన పిసినారి గుణం ఉన్నది. మచ్చుకైనా దయాగుణం, జీవకారుణ్య లక్షణాలు లేవు.

ఇవి లేనివాడు, ఒక రాజ్యానికి మంత్రిగా ఎన్నటికీ రాణించలేడు. పిల్లి చిక్కిపోతున్న ప్పుడయినా దానికి సరైన ఆహారం దొరకడం లేదని గ్రహించి తగిన ఆహారం పెట్టవల సింది! అతడి పిసినారితనం తనలోని ఇంగిత జ్ఞానాన్ని పూర్తిగా కప్పివేసింది.

ఈ పరీక్షలో నూటికి నూరుపాళ్లు నెగ్గిన వాడు శ్రీధరుడు. అతడు పిల్లికి సహజాహార మైన ఎలుకలకోసం, దాన్ని తన మిత్రుడింట వదిలాడు.

ఆ విధంగా దాని ఆకలి బాధ నివారణ అవడమే గాక, ఆ మిత్రుడికి కొంత ఎలుకల బాధ తప్పి ఉంటుంది. అంతే కాక, ఎందు కైనా మంచిదన్న ముందుచూపుతో దానికి ఒక్కపూట స్వయంగా పాలు పోశాడు.

మంత్రి అయిన వాడిలో ఉండవలసిన వివేకం, విచక్షణాజ్ఞానం - అన్నీ శ్రీధరుడిలో సహజలక్షణాలనడంలో సందేహం లేదు. అందుకే, అతడిని మంత్రిపదవికి ఎన్నిక చేశాను.'' అన్నాడు.

మంత్రి సుదర్శనుడు తార్కికంగా ఇచ్చిన ఈ వివరణ విన్న సభికులు మంత్రి నిర్ణయం పట్ల తమ హర్షామోదాలు తెలుపుతూ పెద్దగా కరతాళధ్వనులు చేశారు.



CHANDAMAMA (Telugu) June 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




మహేష్, ఆషే కవల పిల్లలు. ప్రతి విషయంలోనూ వీరు పోటీ పడుతుంటారు.




చదువులో-




ఆటల్లో-




ఓ సాయంకాలం ఆషే తన టీషర్ట్ మీద ఏదో అతికిస్తుండగా మహేష్ చూశాడు.




ఇంగ్లండ్ ప్యాచ్ అంటించిఉన్న టీషర్ట్‌ని ఆషే ఎత్తి చూపించాడు.




నువ్వు ఇంగ్లండ్‌ను బలపరుస్తావా?




మహేష్ తన టీషర్ట్‌మీద ఇంగ్లండ్ ప్యాచ్‌ను చూపించాడు.




మహేష్, ఆషేలు పక్కున నవ్వారు. చేతులెత్తి చరిచారు.




ఈ ఫుట్‌బాల్ సెషన్‌లో రెండు బుబ్బాలోలతో ఒక ఫుట్‌బాల్ ప్యాచ్‌ను ఉచితంగా పొందండి.

